# వ్యాసావళి





ఉభయ భాషా ప్రవీణ
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

చెన్నపురి:

ఆంధ్రపత్రికా కార్యాలయమున

ముద్రితము.

# ప్ర రో చ న

---

"నిఖిల జలధి విద్యాసింధు ముష్టింధగానాం
పరఘటితి పరీక్షా యుజ్యతే సజ్జనానాం"

కావ్య సాగరగర్భంలో అణగి మఱగిన విశిష్ట గుణదోషములను ఎత్తి చూపే విమర్శకుని కిరాతుడున్నంతకాలమూ కావ్యప్రణేతకు మోక్షం లేదు. అతని తపోపాసనకు సిద్ధిలేదు. ఏ సారస్వతమయినా, పరిపుష్టమూ, భాగ్యవంతమూ అయినదంటే దానికి ఉజ్జ్వలమయిన, ఉదారమయిన విమర్శ ఉన్నదన్నమాట. సంస్కృతవాఙ్మయమును అంత మహోన్నతముగా చేసినవి సాహిత్యదర్పణము, ధ్వన్యాలోకము, రసగంగాధరమూ అనే విమర్శనగ్రంథములే అంటే విమర్శనవాఙ్మయపు పరమార్థము స్ఫురిస్తుంది.

కావ్యంమీద విమర్శకునకు, విమర్శమీద కవికీ, సామరస్యమూ, సద్భావమూ లేకపోతే ఆవాఙ్మయం ఎన్నటికీ అభ్యున్నతికి రాలేనిమాట తథ్యము. అయితే కటువిమర్శకు కవీ, వికృతకావ్యమునకు విమర్శకుడూ ఉద్వేజితులు అవకమానరు.

నాకు విమర్శన అంటే చాల ఆదరము; అభిమానము. చాలావరకు జాగ్రత్తగా తత్త్వగ్రంథసమీక్ష చేసి ప్రతిపాదనమున కెడమీయకుండా పిండితాంశమును ఖచ్చితంగా చెప్పడంకోసమే ఈప్రయత్నం చేసినాను. ఈ లక్ష్యం ఈ వ్యాసపంచకమందు ఏమాత్రం కనిపించినా కృతకృత్యుడనే అవుతాను.

ఇందులో రెండువ్యాసాలు (ఆద్యంతములు) 'భారతి'లోను, ఒకవ్యాసం (రెండునక్షత్రాలు) కృష్ణాపత్రికలోను ప్రకటితములయినవి. శబరీ సమాలోకనమూ, గురజాడ వాల్మీకీ చాలరోజులు వ్రాతప్రతులుగానే నాదగ్గర ఉండిపోయినవి.

చేతికెముక లేని విశ్వదాత శ్రీ నాగేశ్వరరావు పంతులవారి ప్రసన్నదృష్టికి పాత్రమయిన నా విమర్శన పరంపర నేటికి గ్రంథరూపం పొందినందుకు శ్రీపంతులు వారికి హృదయపూర్వక కృతజ్ఞతా నమస్కారములు నివేదించుచున్నాను. ఆంధ్రసుహృదులు ప్రసన్నమనస్కులై ఈగ్రంథమునుచూచెదరని విశ్వసించుచున్నాను.

హనుమచ్ఛాస్త్రి

# సీతమ్మశోకము—పాపరాజు

---

శ్రీ తమసాతీరమున దినమణి దివ్యతేజఃపుంజము వెల్లివిరిసి వెలుఁగు మధ్యాహ్నకాలమున పాఁ మేనిషాదుఁడు జక్కవకవ నేయ సమకట్టెనో కాని ఆపుణ్యక్షణమున, ఆ సువర్ణక్షణమున ఆదికోకిల కన్నెఱ్ఱఁజేసి తియ్యనిగొంతు కదిపి 'కూ' యని గద్దరించినది. ఆకూఁతకు వాక్పతి తాళపువేఁత దొరకినది. దాని కనంత కల్యాణగుణాభిరాముఁడగు శ్రీరామచంద్రుని శుభచరిత్రము కేలూఁత యైనది. ఆ యనంతమధురగానము ముల్లోకములను ముమ్మరించి, ఘోరుఘోరున నేఁటికిని మ్రోఁత వెట్టు.

మొదటికోయిల 'కూకూ'లు మేలుబంతులు కుమారకలకంఠములు గొంతు సవరించి, హావణించి, తీర్చి, దిద్దిదిద్ది, మించి పాడుకొన్నవి.

భవభూతికి శ్రీమద్రామాయణపురుచి తగిలినది. రెండునాటకములుగా మనసుపడి వ్రాసికొన్నాఁడు. కాని "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే."

పాపరాజు పనికట్టినాఁడు. పరమపురుషుని యుత్తర కథ పసందుగాఁ పాడుకొన్నాఁడు. భవభూతి యభిమానించిన పాత్ర శ్రీరామచంద్రుఁడు. పాపరాజు భక్తితోఁ బోషించుకొనినపాత్ర సీతమ్మ. "త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం" అని రాముఁడై యన్న భవభూతి హృదయమును దెలిసికొని సీతమ్మయై పాపరాజు "భావ మెప్పుడు దనమూర్తిఁ బాయ దనుము" అనినాఁడు.

కంకంటి పాపరాజునుత్తర రామాయణమున నొక రసవద్ఘట్టము సీతమ్మశోకము. భవభూతి యెట్టి యనుభూతితోఁ దన యుత్తరరామచరితపుఁ దృతీయాంకమును వ్రాసెనో యట్టిరసవన్నిష్ఠతోఁ బాపరాజు జానకీ శోకఘట్టమును విరచించెను. భవభూతి యుత్తరరామ చరితమునఁ బుటపాకప్రతీకాశ మగు వియోగబాధచే క్రుగ్గిపోవుచున్న శ్రీరామచంద్రుని దుఃఖాక్రందనములకు జవాబుగాఁ బాపరాజు సీతమ్మ పవిత్రమధుర స్నిగ్ధ హృదయమును జూపినాఁడు. నే నీఘట్టమును జదువునప్పుడు హృదయము దుఃఖాభుగ్న మైనది. కన్నులు చెమ్మగిలినవి. ఎదియో మధురిమ స్ఫురించి ముగ్ధునిఁ జేయును. "ఏక స్స్వాదు నభుంజీత." కనుక పాఠకులకుఁ గొంత చవి చూపఁదలఁచితిని.

చిత్రకారుఁడు గీసిన గీఁతలో జీవరేఖ యంతర్వాహినిగా ప్రవహించును. వస్తువును భావించుటలోను, అవస్థను గనిపట్టుటలోను, ఔచిత్యమును గమనించుటలోను, రసానుభూతిలోఁ దొప్పదోఁగిపోవుటలోను గవితో సమానముగఁ జిత్రకారుఁ డావేదనపడును. కాని చిత్రకారుని కుంచియకంటెను గవికలమున విశిష్టరచన కలదు. చిత్రమున మూఁగసోయగము గలదు. కవిగీతమునఁ జిత్రకారుని చిత్రణాసౌష్ఠవమును, గాయకుని రాగమాధుర్యమును నెలకొనుటయేకాక కావ్యోపనిబద్ధ తత్తత్పాత్రలు తమ యపూర్వసూత్రధార కౌశలమున రసమూర్తులై వారివారి యవస్థలలో మనలనుగూడ నాకర్షించుకొని తత్తద్రసాలంబనములలో మనలనుగూడ జోడించి చొక్కించుతురు.

పాపరాజు హృదయము రసభరిత మైనది. ఈ శోకఘట్టమును నటించుటకుఁ దానె యాభూమికను ధరించుకొని రంగమున కురికియుండును. ఎంత నిష్ఠతో, ఎంత యనుభూతితో, ఎంత వస్తుతత్త్వజ్ఞతతో సీతాపాత్ర నాయత్తపఱిచినాఁడో కదా కవిచంద్రుఁడు! "అశ్రుశాంగి మరలఁ గన్నుఁదామరలు విచ్చి విచ్చి విడి వెడలెడు నశ్రుధారాప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువాఱ జాళువా మెఱుంగు పయ్యెదమీఁదికి

దిగజాఱి యుత్తుంగతర స్తన కనకకలశంబులు నిండుకొన మెండుకొను నిట్టూర్పు సెకలం దగిలి చిగురువాతెఱ తుకతుక నుడుక నుడుగణంబుల బెడంగు నడంగఁ ద్రొక్కు చేర్చుక్క తెరల తరళతర చికురనికరంబు లళికఫలకంబుపయిం జెఱలాడ తురిమిన విరులసరులతో నోఱలి కొప్పుపెన్నెఱు లంసభాగంబునం బొరలిపడ జడుపుఁ జెమ్మటలు గ్రమ్ముకొని నెమ్మేను గడగడ వడంక కడంకదక్కి చిన్ని మొగంబు విన్నఁదనంబున కిమ్ముఁ జూప పరితాపదవానలంబునం బడి పురపురఁ బొక్కుచుఁ దాల్మిఁ దూలి స్రుక్కుచు లేచి కూర్చుండి శోకరసం బాకారంబుఁ దాల్చిన చందంబున, చిత్ర రూపంబు గాత్రంబుఁ గైకొన్న చెన్నున, సాధ్వసంబు సాధ్వి యైనకరణిం, గరుణంబు కరణంబు నొందిన తెఱంగున నుఱక వెక్కి వెక్కి యేడ్చుచు, నేడుపు విడిచి ధ్యానంబుఁ బూనుచు, ధ్యానంబు మాని దనలోఁ దా వగుచు, నగ వుడిగి తలయూఁచుచుఁ, దలయూఁపుట విడిచి ముక్కుపై వ్రేలు గీల్కొలుపుచు జాలిఁగొని హాహా కారంబులు పలుకుచు ”న్న సీతమ్మను జూచిన నే సహృదయునిగుండె కంపించి నీరు కాకమానును? కవిచంద్రుఁడు కన్నులం బూసి కాంతాకాంతరమునఁ గటకటం బడు చున్న సాధ్వీమతల్లి కష్టదుర్దశను దన యుద్యోతించు

భావనాశక్తివలనఁ గనిపట్టినాఁడు. చూచిన హృదయము కరుణాప్లావిత మైనది. రసవీచికాపటలిఁ దూఁగి తూఁగి జోగిపోయినాఁడు; రసానుభవ మైనది. ఇఁకఁ దన కావ్యప్రసక్తికై కలము చేకొనినాఁడు. పదములను ప్రయోగించి పలుకుబడి ననుసరించి పరస్పరోపసందాన సౌష్ఠవము నుపలక్షించి సీతమ్మ నెంత స్వభావసుందర ముగఁ జిత్రించినాఁడో చూడుఁడు. అంత శోకదీనదశ యందును సహజగంభీరశీలయగు సీతమ్మ దుఃఖావేగ మాఁపుకొని ప్రయోల భయవిషాద సంచలితగాత్రుఁడై

"మితిలేని యీ మిడిమేలంపుమోకములు
సకియల బలఁగమే జనని నీకు?
పరికింపరాని యీ బలుమలల్ నవరత్న
మయచంద్రశాలలే మాత నీకు?"

"పత్నిఁ బాయంజేసి నిన్నొంటి డించినపాపాత్ముఁడ"
నని వాపోవు మఱందితో

"అడ్డలకుమన్న నీకు వసు
ధాధిపునానతి దాఁటవచ్చునే
యిడుమలఁ జెందు మంచు విధి
యీధర నన్ను సృజించియుండఁగాఁ
గడవఁగ నెవ్వరోపుదురు?"

అని గుండె రాయిచేసికొని బల్కెను. అట్టి విచక్షణత, ఓరిమి, ఆయనకుఁ గాక యేరికిఁ జెల్లును? ఆసాధ్వి యున్నతహృదయమును గుఱుతించి పలికించుటకుఁ బాపరాజునకుఁ గాక యేరికి సాధ్యము?

వాల్మీకిమునీంద్రుని యుత్తరకాండలో నింత రస స్ఫూర్తి నెలకొనలేదు. ఆతపస్వి యీపట్టును గవితా దృష్టితో కాక కథాదృష్టితో మాత్రమే రచించెఁ గావలయు. చూడుఁడు:

"తదేత జ్జాహ్నవీతీరే బ్రహ్మర్షీణాం తపోవనమ్,
పుణ్యంచ రమణీయంచ మా విషాదం కృథాః శుభే.
రాజ్ఞో దశరథ స్యేష్టో వాల్మీకి ర్మునిపుంగవః.
.............................................
ఉపవాసపరైకాగ్రా వస త్వం జనకాత్మజే,
పతివ్రతాత్వ మాస్థాయ రామంకృత్వా సదాహృది."

లక్ష్మణుఁడు సీతమ్మ నడవిలో డించిరావలసి వచ్చినపుడు, అతనికిఁ దనజీవితముపై రోఁత, ధేనువును వత్స విడువలేనట్లు పవిత్రమాతృప్రేమామృతమును గోల్పోవువప్పటి బేలతనపుటమ్మలిక, దుఃఖోన్మాదము సహజములు. సీతమ్మను చూచినంతనే గుండె చెదరి పోయి కన్నీరు [illegible] జుట్టుకొనుటకు

మాఱుగా "నిది యందమైన జాహ్నవీతీర తపోవనము. నీవేమియు విచారింపకుము. ఇది మాతండ్రిగారి మిత్రుని యాశ్రమము. పతివ్రతవై యుపవాసములు చేయుచు నెల్లపుడును రాముని ధ్యానింపుము" అని యెవఁడు చెప్పును? ఈరచన యస్వాభావికము. పై నుదాహరించిన పాపరాజురచన స్వాభావికము.

రామచంద్రుని ప్రతిధమనిలోను సీతాప్రేమ కూలముద్రుజమై ప్రవహించుచున్నది. అఖాతసీతాహృదయమునఁ బవిత్రప్రణయమధువు నిండి నిబిడీకృతమైనది. ఆప్రేయోమూర్తులప్రేమ అగమ్యము, అసాధారణము. "హృదయంత్వేవ జానాతి" అట్టి ప్రేమైకజీవికి లక్ష్మణుని యుపదేశముద్ర యేమి? పాపరాజు లక్ష్మణుఁడు

"జననీ, నీవు మహాపతివ్రతవు, నీ
సౌశీల్య మిల్లాంధ్ర కె
ల్లను మేల్బంతి రఘూద్వహాంఘ్రియుగళీ
లగ్నాత్మవై యుండుమీ
యని నే నెవ్వఁడ విన్నవింప?"

అని యుచితముగా మనవిచేసికొన్నాఁడు. తిక్కనార్యుఁడును నిప్పట్టున నీరసముగనె చెప్పియున్నాఁడు.

"ఆశ్రమ మల్లదె మునిచర
ణాశ్రయవు నిరస్తశోకవై యుండు జగ
ద్విశ్రుతియగు నీ పతియును,
నాశ్రమరహితుండయింకనని పల్కెటయుః."
(నిర్వచనోత్తర రామాయణము)

ప్రాణపతి నెడఁబాసిపోయి మిన్నుమన్నుఁగానక నేక ధారగా నేడ్చు సీతమ్మతో "నిరస్తశోకవైయుండు"మని యెంత జాలిమాలి పల్కినాఁడో యీ లక్ష్మణుఁడు! ఇంక నీసీతమ్మజవాబు చూడుఁడు.

"అగుఁగాక యట్ల చేసెద,
జగతీపతిపనుపుఁ జేసి చను నీవును, నీ
తెగువ రఘుపతికి నీకుం
దగవఁట, యే ననెడి దేమి?"

అని నిస్స్నేహముగఁ దెగువమైఁ బలికినది. సీతమ్మ యాక్లిన్నఁటికిని బలుకఁజాలదు.

"అడలకు మన్న నీకు వసు
ధాధిపునానతి దాఁటవచ్చునే,
యిడుమలఁ జెందు మంచు విధి
యీ ధర నన్ను సృజించియుండఁగా
గడవఁగ నెవ్వ రోపుదురు?"

అనియే యనఁజాలును! సాధ్వీరత్నములకుఁ బ్రాణపతి వియోగముకంటె దుర్భరతాపము, దురంత వేదన వేఱొక టుండదు. ఇట్టి కష్టస్థితికి దొలిపుట్టువునఁ బ్రేమపాశ బద్ధు లగు దంపతుల నెడఁబాపిన ఘోరకిల్బిషమే కత మని వారియెడంద తల్లడపడును. ఇంకెట్టి మహాపాతక మును నిట్లు చేసియుండు నని వారు నమ్మరు. ఇం కెట్టి పాపఫలమునైనను వారు సంతోషముతో నిర్భరానంద ముతో ననుభవింప సిద్ధముగా నుందురు.

సీతమ్మ కట్టియూహాయే పొడకట్టినది. పూర్వపు కాఱడవివాసము ప్రాణపతితోఁ బరమసంతోష మనిపిం చినది. ఇప్పటి, ఈ రమణీయజాహ్నవీపరిసర పవిత్రతపో వనవాసము 'మేనఁ బ్రాణములు భరింప'నీయనిదైనది.

"ఎడపక పూర్వజన్మమున

నే మిథునంబులఁ బాయఁజేసి వా

రడలఁగ నవ్వుచుండితినొ?

ఆయఘ మూరకపోనె? నాఁడు నా

అడవుల రామపాదజల

జాప్తి వసించితి నేఁడు నాథు పాం

దెడసి యనాథనై యిచట

నేగతి మేన భరింతుఁ బ్రాణముల్."

తపోధనకవియు,

"కింను పాపం కృతం పూర్వంకో వా దారై ర్వియోజితః,

..................................

పురాహ మాశ్రమే వాసం రామపాదానువర్తినీ,

అనురుధ్యాపి సౌమిత్రే! దుఃఖేచ పరివర్తినీ,

సా కథం హ్యాశ్రమే సౌమ్య వత్స్యామి విజనీకృతా."

అని చెప్పెను.

ఇఁకఁ దిక్కనార్యుఁడు

"ఇడుమలు పొందఁగఁ బుట్టిన

యొడ లిది యిటు లోపుఁగాక యొడ్డులు నాచేఁ

బడిరి తొలుభవమునం ది

ప్పుడు తత్ఫల మందకున్నఁబోవునె నాకున్."

అని

"మామికేయం తనూ ర్నూనం

సృష్టా దుఃఖాయ లక్ష్మణ!"

అనుమాటతో నందుకొని కుదించి కూర్చువలచినాఁడు.

సీతమ్మ వెనుకటి జీవితమును దలఁచుకొనినది. పూర్వభర్తృవాల్లభ్యమును భావించుకొని కుంగిపోయి నది. గుండె వ్రయ్యలైపోవ దేమని యడుగుచున్నది:

"ఏను సాధ్వి ననుచు నెల్ల వారలు నన్ను

సన్నుతింతు రమ్మను సంతసింతుఁ

గాని నడుమ నిట్టి కటికనిందలు పుట్టి
యడవిఁ ద్రోయు రాముఁ డనుచు నెఱుఁగ.

కటకట లక్ష్మణా! పిడుగు
కంటెను బెట్టిదమైన మాట నేఁ
డిటు వినియుండియున్ బగుల
దింతలు నింతలు గాదు గుండె మె
ప్పటివలె నున్న దీ కటిక
భావముతో నసువుల్ భరించి యి
య్యటవిని యింక నేవలన
నాపద లొందఁగనున్న దాననో!"

తన ప్రేమమూర్తిని, హృదయపతిని తలంచుకొనుసరికి హృదయము పరవశ మైనది. ప్రేమోన్మాద మెత్తినది.

పదునాలు గేఁడు లేడుగడయై, దాసుఁడై, భక్తుఁడై తమ్ము నెడఁబాయక పుత్రునివలె మెలంగిన సౌమిత్రిపై నమ్మకము లేక

"కళవళమంది తెల్పితివొ?
కాక పరాకున దప్పవింటివో,
కలనయినన్ రఘూద్వహుఁడు
కానలలో నన్నుఁ ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ మ
తిభ్రమ మైనదొ?"

అనినది. కొంతవడికి తెలివితెచ్చికొని

"హా సహింపు మి
ప్పలుకు లెఱుంగ కంటి వెత
వాటిలె నీ కొక భ్రాంతి యున్న దే?"

అన్నది.

క్రమముగా సీతమ్మకుఁ బ్రళయము క్రమ్మినట్లయి నది. ఏనరకలోకమునకో యీడ్చుకొనిపోవుచున్న ట్లయినది. తమ యనంతప్రణయప్రబంధరసవద్ఘట్టమున కాశ్వాసాంతమాయెనని పాప మా పువుబోడఁద వేగిరించినది. పొంగిపోవుచున్న బెంగతో

"ఎన్నఁటికిన్ రఘూద్వహుని
నేనును నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁగాఁగదొకో?
కల్గకయుండినఁ బ్రాణ మేల పోదన్న"

అని బేలగా జగన్మాత ప్రశ్నించుచున్నది. ఆ దురంత వేదన భరింపఁజాలక వెఱ్ఱినిస్పృహతో "నాదు మేనున్నది చెంత గంగమడుఁగున్నది గైనటు లయ్యేడుందుదిన్" అనుచున్నది. వాల్మీకి ప్రేమోన్మాదమును క్షమింపలేదు. "అద్యైవ సౌమిత్రే, జీవితం జాహ్నవీజలే త్యజేయం" అని వదలివేసినాఁడు. కవిరాజగు పాపరాజు "చెంత గంగమడుఁ గున్నది" అని కావ్యజీవితమును గమనించినాఁడు.

ఇప్పటిన నిర్వచనోత్తరరామాయణమున "జాహ్నవీ సలిలసేచన మూర్ధ్వగతి ప్రదంబు" అని యున్న వాక్యము సరసముగ లేదు. సీతమ్మకుఁ గావలసినది శ్రీరామ ప్రేమామృతము. ఆయమృతము నాస్వాదించుచుఁ గాఱడవులనైన హాయిగాఁ గడపఁగలదు. కాని ఆప్రేమో మూర్తి లేని స్వర్గరాజ్యమునైన సేవగించుకొనును. ఎన్నఁటికైన రఘూద్వహుని నీమె కనుంగొనఁగల్గునో నీ భయంకరప్రదేశముననె నిద్రాహారములు మాని నిరీక్షింపఁగలదు. "చూడఁగల్గుదొకొ ?" అప్పుడు రాముని జూడని యీ వేదనమును భరింపలేక ప్రాణోత్క్రమణో పాయముగ గంగమడుఁగును జూడఁదలఁచునుగాని ముముక్షువై యూర్ధ్వగతి ప్రతిగ్రహణమునకుఁ గాదు. పాపరాజీపద్యమును (ఎన్నఁటికిన్ అనునది) పాపరాజై వ్రాయ లేదు. సీతమ్మయై ప్రేమోన్మత్తుఁడై విలపించినాఁడు. ప్రేమైకజీవికి ప్రేమయే భోజనము, ప్రేమయే వస్త్రము, ప్రేమయే దివ్యసౌధము. దానితోడనే సీతమ్మ యశోక వనమును గల్పించుకొనినది. ప్రతిపాదపచ్ఛాయను, ఆస్నిగ్ధ మోహనజలధరమూర్తి చిఱునవ్వుఁ జిలుకుచు ప్రోల నిలుచును. కనుకనే యీదుర్భరవియోగమును తృణ ప్రాయముగ సహించినది. కాని యీనిరవధి ప్రళయ మున నిలువఁజాల నని జేలయై వాపోవుచున్నది.

"పతి మతి నెంచెనేమొ తనుఁ
బాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునాళ్లనుచుఁ
గ్రమ్మఱఁ దాఁ జనుదెంచు శత్రునిన్
హతునిగఁ జేయు నేలు నను
నాశగదా బ్రదికించె నాఁటి కా
గతి నిఁక నేమియునుఁ గొని
కాయము నిల్పుదు తెల్పు లక్ష్మణా!"

క్రమముగా హృదయ ముద్రిక్త మైనది. సింహావలోకనమునఁ బౌరజానపదులు పొడకట్టిరి. ఎద రవుల్కొనిపోయినది. కన్నులముంచు కోపము వచ్చినను జిగురువాతెఱమెత్తి మందలింపని దయామయస్వాంత, "ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకున్ భయమంది"న కఱకుఁదనమునకు గర్జించుచు,

"ఆకరుణ యాప్రసన్నత
యాకూరిమి యాప్రియోక్తి యాగౌరవమున్
కాకుత్స్థుఁడు మఱచెఁగదా"

యనుచున్నది.

అమ్మా! మఱవలేదు, మఱవలేదు, ఆ పురుషోత్తము నొక్కసారి కన్గొనుము.

"స స్వకరుణే వైదేహి! క్వాసి ప్రియే! దేవి ప్రసీద! ప్రసీద! న మా మేవంవిధం పరిత్యక్తు మర్హసి ...........సౌమిత్రేరపి ప్రత్రిణామవిషయే తత్ర ప్రియే క్వాసి మే. హా హా దేవి స్ఫుటతి హృదయం."

అమ్మా! చూచితివా?

"ఆకర్ణాయత నేత్రమై మణిమయోద్య
త్కుండల ద్వంద్వశో
భాకీర్ణాంచితగల్లమై సురదనం
బై సుందరభ్రూయుతం
బై క్రమస్మితచంద్రికా విలసితం
బై, యొప్పు శ్రీరాముమోము"

నీకొఱకె ట్లు పరిపాండుదుర్బల మైపోయినదో-

అమ్మా! దగ్గుత్తికతో నే మనుచున్నావు?

"వనమున కేల వచ్చితివి
వల్లభునిం బెడఁబాసి యొంటిగా
నని మునిపత్ను లెల్ల గుమి
మై యడుగన్, ధృతిమాలి వారి కే
మని వివరింతు నింత విప
దంబుధి నేకరణిం దరింతు నే
యనువున నీ ప్రతీక్షణ మ
హాయుగముల్ క్రమియింతు లక్ష్మణా!"

అనియా? ఎంత వెఱ్ఱిపడుచున్నావు.

"జననీ! నీవు మహాపతివ్రతవు నీ
సౌశీల్య మిల్లాంధ్ర కె
ల్లను మేల్బంతి"

యని వా రెఱుంగుదురు. నీ యంఘ్రికమలరజోలేశ
ములఁ గన్నుల నద్దుకొందురు.

*　*　*　*

ఈ మహాకవింగూర్చి యొక గ్రంథము వ్రాయ వచ్చును. ముఖ్యముగా నాకు నచ్చిన దీయన యద్వితీయభావనాశక్తి. దానికిఁ దగిన పదముల నాణెము. రసబంధురకవిత్వ మీాయనసొమ్ము. ఏకసందర్భమును గూర్చి వ్రాయునపుడు నిష్పాక్షికముగా వ్రాయఁదలంచుటచే నిందలి నిరసనాభాసములకు వే ఱూహింపుట తప్పు.

నాగపూడి కుప్పుసామయ్యగారు నిర్వచనోత్తర రామాయణ టీకలో "వ్రతానా ముత్తమం వ్రతమ్" అన్నట్లే వ్రాసినారుకాని యితరపుస్తకముల జోడింపరైరి. ఇది సారస్వతవికాసమునకుఁ ద్రోవ కాదని నా తలంపు. సుధీవరమిత్రు లిట్టి సంయోజక పరిశీలనలఁ గావించిన నాంధ్రసారస్వతమునకు మంచిమేలు చేసిన వార లగుదురు.

# గురజాడ వాల్మీకి

---

## "తూర్పు బలబల తెల్లవారెను"

అక్కడనే, ఆతూర్పు మొగముననే ప్రొద్దుపొడిచింది. విరిసిన వెలుగుబాటలో విశ్వము ఆవులించింది.

ఆ మహాతపస్వి అఖాతసముద్రమున యథావిధిగ మునిగి తేలినాడు. అఘమర్షణ మయిన దనుకొన్నాడు. మరల మునిగినాడు. చేతికందిన సికతాకణము సైతము జారనీయలేదు. ఎన్నో కమండలువు నిండ గలగల నింపి నాడు. బరువునైన పాటింపక మూటకట్టినాడు. బాట పట్టినాడు.

మార్గమధ్యమున ఉషోవిలాసిని పసిడి వేకువ కొనల మరకతవేదికలపై విరజల్లిన మంచుముత్యాలు ప్రోవులు ప్రోవులై పడియున్నవి. అకృతకమయిన ప్రకృతిమాధుర్యమునకు ఆతని హృదయమురుద్ధ మయిపోయినది. గమనించినకొద్దీ గగుర్పొడిచింది శరీరము. మోసితెచ్చిన బరువు దుర్భర మవుతున్నది. దిమ్మరించి పారవేసినాడు. రత్నములపేరిట రాళ్లు

ఎన్నో రాలిపడ్డాయి. లలిత సుకుమారము లయిన మంచుముత్యాలు చూచి

“ గుత్తునా ముత్యాల సరముల ·
కూర్చుకొని తేటైన మాటల ”

అని గొణుగుకొంటూ చెలామణీ చేద్దా మనుకొనేసరికి అసలు ముత్యాలు ‘ కాపు కావు ’ అని కాకులు నాలుగు మూలలనుంచీ లేచి గోలగా అరవడము మొదలు పెట్టినవి. మాయముత్యాలమోసానికి ఎవరు మెచ్చుకుంటా రని మెరుగూ - వెలుగూ చూడలేని ముసలి గుడ్లగూబలు మొర పెట్టినవి.

అఖ్యాత తేజఃప్రణాళి, అనంత విచక్షణాసమున్నతము, అయిన ఆఋషీశ్వరుని చూపులోని పద్మరాగపు జీరలు గ్రీష్మించి కట్టెండలు కాసినవి.

“ మెచ్చనంటా వీవు నీవిక
మెచ్చకుంటే మించి పోయెను
కొయ్యబొమ్మల మెచ్చు కనులకు ·
కోమలుల సౌ రెక్కునా ?”

అని ఉద్రిక్తుడై కసరివేసినాడు.

[illegible] తాతపాదుని [illegible] ముఖం నుండి నిక్కమైన కవిత్వం ఉట్టి పడ్డది. Electric shock

వంటి అనుభవాఘట్టనం ఏసహృదయుని కొట్టి వివశుని చేస్తుందో అతని హృదయమును చీల్చుకొని కవిత్వం ఎగసిపడుతుంది. దానికి తగిన భాషాసహకారం దొరకితే అదే స్వాదయోగ్యమయిన కావ్యం అవుతుంది.

ఆ కావ్యములోని ప్రతిమాట పఠితను పట్టుకొని అంతరింద్రియాలలో మారు ప్రోగుతుంది. తలలో కల్పించుకొనిన ఆవేశమునూ కవిత్వము లాగే కనపడుతుంది. అది స్వాదుగానే అనుభవములోకి వస్తుంది. కాని తాత్కాలికంగా మెరసిపోతుంది. ఇందులో కవి కనిపిస్తూ దిగ్గుతూంటాడు. మొదటి దానిలో కవిని పట్టుకోలేము. పాలలో వెన్నవలె అంతటా నిండిపోయి అగోచరు డవుతాడు.

సంస్కృతవాఙ్మయంలో మొదటికక్ష్యకు చెందిన వారు వాల్మీకి, భవభూతి, జయదేవుడు మొదలయిన వారు. రెండవ కక్ష్యలోనివారు కాళిదాసు, మాఘుడు, శ్రీహర్షుడు మొదలయినవారు. పూర్వాంధ్రవాఙ్మయంలో పోతన్న, త్యాగయ్య ప్రభృతులు ప్రథమ కక్ష్యకు, తిక్కన్న, సూరన్న, శ్రీనాథుడు మొదలగు వారు రెండవకక్ష్యకు చెందుతారు.

ప్రాపంచిక మయిన సుఖదుఃఖములకు అడ్డముగా తెరవేసికొని తపస్సమాధిలో కన్నులు మూసిన తాత

పాదుని హృదయం కుసుమ సుకుమార మయినది. దానికి హఠాత్తుగా ఏ ప్రబలాఘట్టనం తగిలినా ఓర్చుకో లేక తల్లడిల్లిపోతుంది. అట్లాగే జరిగింది.

కామమోహిత మయిన క్రౌంచద్వంద్వంలో కలిగిన విషమపరిణామదర్శనం పాపం ఆతపస్విలో ఆపుకొనలేని దురంత వేదనను రేపినది. ఆ ఆవేశములో వివశుడై నిషాదుని చావుమని శపించేశాడు. ఆ ఆవేశమే సంస్కృతవాఙ్మయమునకు మేలుబంతి. మహాకావ్య బీజం అయి ఊరుకుంది.

ఆరోజులలో సంఘం పురివిప్పుకొని ఆడుతున్నది. అది వేసిన శిక్షకు అందరూ, తలలొగ్గవలసినదే. ఎందరో విచక్షణులూ, తత్వద్రష్టలూ, అప్పుడూ ఉన్నారు. కాని సంఘం ఎర్రగా చూస్తే వణకేవారు.

అప్పారావు ప్రతిభ అనన్యసామాన్యం. సంఘానికి ఎదురుతిరిగి ఢీకొన్నాడు. ఎన్నో బాధలు పడ్డాడు. ముక్కు పచ్చలారని బాలికల దుస్థితినీ, విరుచుకొని పడ్డ జీవనభారంతో పుడమికంటా అంటుకొనిపోయిన అనాథలను చూచి వలవల వాపోయినాడు. మొరకు మానవులమీద గుద్దెర జేశాడు. ఆ ఎరుపుమంటలో మండ్చే 'కన్యాశుల్కం' ధామ్మని పేలింది. ఆ 'అగాధ' తో ఆంధ్రదేశం దద్దరిల్లిపోయింది. ఈదెబ్బ దేశానికే

కాకుండా ఇనప గొలుసులతో కట్టిన తెలుగుసారస్వతం మీదగూడా పడి లింకులను వదులుచేసింది. ఒక్కసారి అందరూ ఆదిక్కునకే చూచారు. ఆతపస్వి చేతులలో ముత్యాలసరాలు మిలమిల మెరసినవి. ఇవే నవాంధ్రసారస్వతమునకు తలకట్టులు. విజ్ఞానకోశములు. ఒరవడులు.

వీరేశలింగము విజ్ఞశిఖామణి, మేధావి, ఉపస్కర్త, సంస్కర్త, కాని గురజాడ వాల్మీకి ప్రతిభ ముందు ఆయన వైచక్షణ్యము ఒదుగుతుంది. గురజాడ వారి రచన కొంచెమే అవుగాక, కాంతాసమ్మితము. రసదిగ్ధము. ఆయనరచన విస్తృతమేకాని సుహృత్సమ్మితము.

"ముత్యాలసరములు" అను ఖండకావ్య సంపుటము 1910 సంవత్సరమున వెలువడినది. 'వ్యావహారిక భాష అంటే గ్రామ్యం' అనేరోజులలో దీనికి ప్రశస్తి లేకపోయింది. భాషబిగింపునకు మెచ్చుకొనే పరిమిత ప్రజ్ఞులకు కంటకమే అనిపించింది. కనుకనే

"కొయ్యబొమ్మల మెచ్చుకనులకు
కోమలులసౌరెక్కు వా?"

అని పకపక నవ్వాడు. గాంధీమహాత్మ శరీరం చూడడానికి ఏమి అందముగా ఉంటుంది. పిచ్చిబాపు. అతని హిమాలయోన్నతాశయములకు ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞుల

గుండెలు ఝల్లు మంటాయి. నందలాల్‌బోసు చిత్రములు బజారుకళ్లకు పిచ్చిగీతలలాగు కనిపిస్తాయి. చూచి చూచి వాటిభావం పట్టుకుంటే ఆ బొమ్మలు పూజాపీఠాలమీద ఉండక తప్పదనిపిస్తుంది. అయితే రవివర్మ బొమ్మలకే అలవాటుపడిన నగ్ననేత్రాలకు ఈయన చిత్రాలను వెక్కిరించవలె ననిపిస్తుంది. ఇట్లాంటిచిత్రకారకుల నందరిని దేశంనుండి తరిమితే దేశం బాగుపడుతుం దనిపిస్తుంది. సరిగ్గా ఇట్లాంటిదే పూర్వప్రబంధాలకే అభినవ కావ్యసంపుటములకు అయిన భేదం.

"నానృషిః కురుతే కావ్యం"

ఋషిఅంశ లేకపోతే సరియైనకావ్యం రానే రాదన్నాడు. అభిజ్ఞుడు. ఋషి అనగా భగవంతుడు. త్రికాలద్రష్ట. కవి ఋషియై జరిగిపోయిన ప్రవృత్తులను జీర్ణించుకొని తనకాలమును సరాసరిగా వాఙ్మయాదర్శంలో ముద్రించుతాడు. ఉంకించి భవిష్యత్తునకురికి ఆత్రోవనే దిగ్దిగంతములు తిరిగివస్తాడు. ఒకమహాకవిని నీవు మెచ్చుకొన్నావంటే అతనివర్తమానమో భవిష్యమాణమో అయిన ఆదర్శం నిన్ను పట్టుకొని నిలబెట్టిన దన్నమాట. కొన్నిశతాబ్దాలు క్రిందట కావ్యంలో ప్రతిబింబం ఉరకించె దానిని నీవు మహాకావ్యం అనకుండా ఉండలేవు. వాల్మీకి భారవి మాఘుడును వర్ణించిన రాజనీతి

ఇప్పటి Politics తో సరిపోతే నివ్వెరపడివానికి నమ స్కరిస్తావు.

గురజాడమహాకవి ఋషి. క్రిందటిశతాబ్దివాడు. ఆయన గిరీశం, రామప్ప, అగ్నిహోత్రుడు, బుచ్చమ్మ, ఇప్పుడు రోజూ కనిపిస్తారు. 'వీళ్లను చూచి వ్రాయలేదు కదా' అనేటంత ఆశ్చర్యం కలుగుతుంది. ఇంకొకశతాబ్ది కయినను గిరీశంచావడు. అప్పుడుకూడా వారిప్రక్కనే తిరుగుతూ సురేంద్రనాథబెనర్జీ అంతవాణ్ణనే చెబుతూ ఉంటాడు. అమాయకపు బుచ్చమ్మలను మాయలలోకి దించుతూ ఉంటాడు. అగ్నిహోత్రావధానులువంటి ఒకాయనను నేనెరుగుదు. కొన్నిఏండ్లకిందట ఉన్న గురజాడ ఈయనను ఎట్లాచూశాడా అనుకుంటాను.

భవభూతి "దళతిహృదయం" కాళిదాసు "రమ్యాణి వీక్ష్య" జయదేవుని "త్వమసి మమజీవనం" వంటివి ఇంకా వేయిసంవత్సరాలకయినా బతికిఉండి ప్రతిజీవితం తోనూ సమన్వయిస్తవి.

అప్పారాయకవి ఆంధ్రవాఙ్మయానికి ఒకసరిహద్దు. ఈయనతో నవ్యసారస్వతయుగం మొదలైనది భిన్నభిన్నప్రవృత్తులతో పెరిగిపోయిన ప్రబంధ వాఙ్మయమునకు నూతనరీతులతో తలలెత్తిన ఆధునికకావ్యములకు ఈయన ఖండకావ్యం పొలిమేర. ఈయనకావ్య

వ్యవసాయము చాలక్రొత్తది. భాషకొత్త, భావముకొత్త, పదవిన్యాసముకొత్త. పద్యము కొత్త పాతల మేలుకల యిక. మొత్తముమీద ఈకావ్యము క్రొమ్మెరుంగుల చిమ్మినది. ఈయనపెట్టిన వ్యవసాయము కొంచెము. పంట యధికము. ఈవిత్తనములే ఇప్పటి తెనుగు పొలాల బంగారుపంట పండుచున్నవి. ఈయన పోకడ చాల స్వతంత్రమయినది. అనవలసినమాట మొగమాటం లేకుండా ఘాటుగా అనేస్తాడు. ఈహృదయావర్తంలో "లోకమందలి మంచిచెడ్డలు లోకులెరుగుదురా ?" అనే సమస్య గిరున తిరిగి తిరిగి ఆవిష్టుణ్ణి చేసింది. ఈ Inspiration తోటే కావ్యమంతా ఉట్టిపడింది.

తోకచుక్కను ధూమకేతువంటారు. ఇదిగనక కనిపిస్తే కొంపలు మునిగికూడూ గుడ్డా కానని దురవస్థలు ప్రళయాలు ముంచుకుపోతాయని నమ్ముతారు. ఇదంతా అబద్ధమనిచెప్పి ఇన్నాళ్లనుండి ఉన్న వెర్రి నమ్మకమును కూకటివేళ్లతో ఊపడాని కెట్లాంటి ఉపన్యాసం ఆరంభి స్తాడో చూడండి.

"కేతువాయది వేల్పులలలనల
కేలివెలి తొగకాంచుమా !

...........................

చన్నకాలపు చిన్నబుద్ధులు
చెదరి ఎంచిరికీడుగా—
.............................."

వెర్రిపురాణగాథలు నమ్మజెల్లునె? పండితుల్. ఈ ఔషధంతో మేళవించిన అనుపాననైపుణ్యమును చూడాలి.

"తెగులు కిరవని కతలపన్నుచు
దిగులు జెందు టదేటికార్యము
తలతునేనిది సంఘసంస్కా_ర
ణ ప్రయాణపతాకగాన్."

ఈ విజ్ఞానరాశికి సంస్కా_రణములకు భయపడి ఖంగారు పడే సంఘం అంతా స్త్రీగా కనిపించింది. సంఘంలో కనపడే అమాయకం, మొండితనం, మొదలయినవన్నీ ఆమెలో ధ్వనింపజేసి నవ్వుపుట్టిస్తాడు.

" వింటి మీా పోకిళ్లు వింటిని
కంట నిద్దుర కానకుంటిని
..............................

చాలునహమీా చాకచక్యము
చదువుకిదె కాబోలు ఫలితము
................................

కలసి మెసగిన యంతమాత్రన
కలుగబో దీ నైకమత్యము
మాలమాదిగ కన్నె నెవతనో
మరులు కొనరాదో—"

ప్రేమ

"నేను నేర్చితి భాగ్యవశమున
కవుల కృపగని"

"ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా"

అని కాళిదాసు సూక్తి స్తే అప్పారాయకవి విప్పిన కౌముదిలో హాయి అనిపించింది.

"కమ్మని తావిగ్రమ్మెడి పుష్పనిచయము ప్రేమె కా
అది లేక మంకెన కెంపు కాంతలయందము"

"అంధే తమసి విధురో మజ్జతీవాంత రాత్మా"

భవభూతి ముక్తకంఠంలో వినిపించిన గంభీరగీతం ఈయన తెనుగు వీణమీద తియ్యగా మ్రోగుతుంది. "ప్రేమకలుగక బ్రతుకుచీకటి"

"జరసా యస్మిన్న హార్యోరసః—కాలేనావరణా
త్యయా త్పరిణతే యత్స్నేహసారే స్థితం భద్రం
తస్యసుమానుషస్య కథమప్యేకంహి తత్ప్రార్థ్యతే."

"మరులు ప్రేమని మదిదలంచకు మరులుమరలును
వయసుతోడనే, మాయమర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె బ్రతుకు సుఖముకు
రాజమార్గము"

పద్మావతీచరణ చారణచక్రవర్తి నాడు కంఠ మెత్తి ఆలపించిన అమరప్రేమగీతం అనంతమారుత భంగాలలో పొంగిపడుతున్నది.

"త్వమసిమమ భూషణం త్వమసి మమ జీవనం
త్వమసి మమ భవ జలధి రత్నం—
ప్రియే చారుశీలే - ప్రియే రమ్యశీలే!"

అందలి ఒక ఊర్పు ఈయనకంఠనాళం మీదుగాగూడా ఇట్లా పయనించింది.

"మగడు వేల్పన పాతమాటది
ప్రాణమిత్రుడ నీకు - నీనెనరు కలుగకయున్న వేదను
కలిగినను నాపదవివేల్పుల రేనికెక్కడ?"

కావ్యమును సున్నితముగా ఎత్తుకొని అక్కడక్కడ అమృతం చిలికిస్తూ నడిపించడంలో అప్పారాయకవి అద్వితీయుడు. పద్యాలలో చిన్నకథలను తీర్చిదిద్ది చిత్రించడములో కనిష్ఠికాధిష్ఠితుడు. ఆతీర్పులో కావ్యమున కుండవలసిన జీవకళలూ, మెళుకువులూ

పువ్వులకు మల్లెవిరిసి కొంటవి. ఈ Influence దీక్షి తులుగారిలోను, శివశంకరశాస్త్రిగారిలోను కొద్దిగానో గొప్పగానో ఉన్నది.

కావ్యములో విస్పష్టతకంటె సందర్భము ననుస రించిన జిలుగుతనం ఉంటేఅందం. కాదంబరిని, కళా పూర్ణోదయమును ఈ అందానికే ఎక్కువ మెచ్చు కుంటాం. అప్పారాయకవి 'లవణరాజుకల' అట్లాంటిది. ఇందులో మెరుపులు, విరుపులు, అందముగా అమరినవి.

ఈకావ్యసంపుటిలో పద్యకథానకములునాలుగు. తక్కిన మూడిటికంటె ఈ కావ్యము పెద్దది. మొదటిది. "సృష్టిరాద్యేవధాతుః" నిజమేమో ?
ఇంద్రధనస్సువలె అన్నిరంగులతోటీ మెరసిన ఈకావ్యం చూస్తే నాకు చాలా ముచ్చటవుతుంది. ఇప్పుడు ప్రబల ముగా సాగుచున్న హరిజనోద్ధరణప్రశ్నను ఈకవీంద్రుడు ఈకావ్యంలోచర్చించి సిద్ధాంతము నిర్ణయించిచాటినాడు.

"మంచిచెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి అన్నది 'మాల' అయితే
మాలనే అగుదున్."

* * *

్రేలు మబ్బుల అంచులంటను
రగిలె రత్నరుచుల్

* * *

పాటబాడెను పాటలాధరి
చెట్లచెమలకై—

* * *

తాటివనమున ఆగిచంద్రుడు
తానుచెవి యొగ్గన్

* * *

కత్తిచంపును - మాటవాతలు
మానవే నాడున్

* * *

............అనుభవమ్ముల
తత్వమెరుగక శుకములగుదురు
వట్టిశాస్త్రజ్ఞుల్—"

ఇందు చెదరిపడిన అలంకారాల నేర్పుచూడ దగ్గది.

"మంచిపల్లె నిది మ్రాయమగునని
మట్టిచనె సంస్కృతిని జీవంబట్లు
పండువెన్నెలకు ముదవనిపై
నిండుగమ్మిన నీడకైవడి"

కన్యక తరువాతి సౌఖ్యకథానకము.
ఈమెను కోమటులు కన్యకాపరమేశ్వరి అని ఇప్పటికిని పూజచేస్తారు. ఈకథ సామాన్యముగా అందరికీ తెలుసు. చెప్పడానికి చాల పేలవంగా ఉంటుంది. ఇట్లాంటికథ అప్పారాయకవి అమృత హస్తంలోపడి రసవత్కావ్యం అయింది. దీనిలో కవి మూడువిధములయిన తత్వములు చిత్రించాడు.

యౌవనతీవ్రవేళలలో పొంగరెక్కిన హృదయంలో ఉండే సౌఖ్యము మొదటిది.

"పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరునిరాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసికమండలిలో —

............ధర్మమార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టికరపడమా? —"

సమయం తప్పితే స్త్రీ నల్లత్రాచు. ఆమె హృదయం పరిభవంచేత ఉత్తప్తమైతే నిప్పుల వాన కురుస్తుంది. భగ్న ప్రేమచేత ఉద్రిక్త అయిన శకుంతల ఉపన్యాసం తలచుకుంటే ఇప్పటికి ఒళ్లు జలదరిస్తుంది. ఈతత్వమే ఇందులో రెండవది.

"కంఠకావరమెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
ఉండడా ఒక దేవుడంటూ
ఉంది ఊర్కొనునా?"

మూడవది అధర్మ పర్యవసానం.

"పట్టమేలే రాజుపోయెను
మట్టి గలిసెను కోటపేటలు
పదం పద్యం పట్టినిలిచెను
కీర్తు లపకీర్తుల్ —"

తరువాతి కావ్యము డామన్ పితియసు. ఈకావ్యము లోని సారాంశము కవియే అరువదిరెండవ ముత్యంలో తళతళ మెరపించాడు.

"వినగ తగినది వింటినిచ్చట
కనగతగినది కాంచినాడను
మనుజులిద్దరు మగువయొక్కతె
మాన్యులీజగతిన్"

మనుజులిద్దరిలో ఒకడు డమనుడు. అతడు "ఇలను ద్రిమ్మరి పలుతెరంగుల జనులగాంచి" నాడు. తన అనుభవములో అమూల్యమైన ఒకవిషయం ఇదేఅంటాడు.

"ఒకటి ఆయెను రెండుమూడులు
ఒకటి ఆయెను కోటిసంఖ్యలు
పెక్కులొకటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే"

అతనిమాట నిజం. మెచ్చుకోతగినది. "నీడ వెలువడి నిలిచె ముందట, వేడ్క మోమున వెల్లివిరియగ" నియమితకాలం దాటకుండా మిత్రుని ప్రాణములు పోకుండా చావునకు సిద్ధమైనాడు.

రెండవవాడు పితియసు. స్వార్థపరమై పాపపంకిలమైన మానవలోకంలో మాణిక్యంవంటివాడు. ఎట్లయినా తన ప్రాణముల వినిమయంతో డమనునివంటి సజ్జనుని లోకంలో నిలపాలని ఆరాటపడతాడు.

"లోకమం దభిమానముంచియొ
నాకుయశ మొనగూర్ప నెంచియొ.
నాకపతి నామిత్రు డామను
రాక నడ్డదొకో"

"బ్రతికిడామను ప్రజలనేదును.
చచ్చి నేనొకడక"

వీరిద్దరిని తీవ్రంగా విమర్శించింది పితియసుభార్య. ఈమెమాటలలో స్త్రీసహజమైనJealousy, అమాయకం

స్త్రీల వాఙ్మయములోనుండి ఇప్పటికి మిగిలినవి కుశలవకథ, (కుచ్చెలకథ) ఊర్మిళనిద్ర, లంకాయాగం, మొంద లయినవి.

వీనిలో ఉండే సహజమైన భావోద్రేకము, కమ్మని అచ్చ తెనుగు నుడికారము, ఇప్పటి కృతక మహాకావ్యములలో లేదంటే ఎవ్వరూ కాదనలేరు.

అట్లాంటి ప్రాచీనపు సౌరభమ్ము రుచిపెంపు పూర్తిగా చూపడానికి కావ్యం ఎత్తుకొని ఆడపిల్లలపాట అన్నాడు అప్పారాయకవి.

ఈ కావ్యం చదివితే ఒక్కొక్కచోట గుండెలు గలవారికి కన్నులు చెమ్మగిల్లక మానవు.

దేశభక్తి అంటే ఏమిటో మొదట తెలియ చెప్పిన మహానుభావు డితడే. తరువాత ఈ పలుకుబడి రాయప్రోలు, విశ్వనాధ, లోను ఉల్బణించింది. దేశ మాత గురించి చెప్పిన ఈయన ప్రతిమాట ఉద్రేకపూరి తంగాను ఉజ్జ్వలముగాను ఉంటుంది.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్,

"ఈ సురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి"

ఆడంబరంగాను గొప్పకోసమును దేశాభిమానం చూపే వారిని చూస్తే ఈయనకు చాల అసహ్యాం.

"దేశాభిమానం నాకుకద్దని
ఒట్టి గొప్పలు చెప్పకోకోయి
పూని ఏదయినాను ఒకమేల్
కూర్చి జనులకు చూపవోయి"

సాదరముగా అనుగ్రహించే ఈ మహోదయుని ఉపదేశములు మరచిపోలేనివిగదా!

"చెట్టపట్టాల్ పట్టుకోని
దేశస్థులంతా నడవవలెనోయి"

"దేశమంటె మట్టికాదోయ్
దేశమంటె మనుషులోయ్"

ఈయన జీవితం ఒకప్పుడు చాలా కష్టములతోను, ఆఘాతములతోను, ఆశాభంగములతోను, [illegible] పోయిందని "ఎత్తులంగరు" అనే కావ్యం చెప్తుంది. దేశసౌభాగ్యమును, విశ్వప్రేమను, కాంక్షించే [illegible]లహృదయమును నలిగినలిగి వివిధ సమస్యలతో [illegible] పడడం, సహజం. అదే ఈయనలో కూడా తటస్థించింది.

కొంటాను. "He experiencd many dificulties in his early life and we find a few autobiographical reflections in his poem yettu langaru"
అని జి. వి. రామదాసుగారుకూడ తమ తొలి పలుకులో వ్రాసినారు.

"విరిగి పెరిగితి పెరిగి విరిగితి
కష్టసుఖముల పారమెరిగితి
పండు వన్నవి ఆశలెన్నో
ఎండిరాలగ పాగిలితిన్నీ"

అంటాడు పాపం. మనిషిఅనే కావ్యం అన్నిటికంటె చిన్నది. కాని వజ్రపుతునక. మెరపులోను ఒరపులోను సాటిలేనిది. "అజ్ఞాన ప్రతిబోధాయ విగ్రహప్రతిష్ఠాపన" అంటాడు విజ్ఞుడు. అజ్ఞానులకు సుజ్ఞానులకుగూడ ఈ తలతిక్క వదలటంలేదు. "గతానుగతికో లోకః నలోకః పారమార్థికః" ఇదే హిందూమతాన్ని పట్టుకొని కన్నులు పొప్పకొరడా చేసింది.

రాజా రామమోహనరాయలు, వీరేశలింగవిజ్ఞుడు, దిక్కులు పిక్కటిల్లేటట్లు కేకపెట్టి చెప్పిన మహానం దేశం గదుకు అప్పారాయకవి ఘంటుగా త్రిసూత్రిలో ముద్రించాడు.

"మనిషి చేసిన రాయిరప్పకు
మహిమకలదని సాగిమొక్కుతు
మనుషులంటే, రాయిరప్పలకన్న
కనికిష్టం"

ఇందులోని రెండవ కోశం చిన్నకథలు. ఇంచు మించుగా ఆంధ్రవాఙ్మయంలో అవతరించిన కథానక సారస్వతమునకు ఇవే పసుపు ఓనమాలు. ఉన్నవి రెండైనా మళ్లీ అట్లాంటివి ఎన్నో లేకుండా చేసి నవి. మొదటికథ "దిద్దుబాటు." Anti-notch కి సంబం ధించినది. రెండవది "మీపేరేమిటి" మతముల మొండి పట్టుదలలకు సంబంధించినది.

అప్పారాయ కవీంద్రుడు రససిద్ధుడు. ఏపాత్రను సృష్టించినా అమరుణ్ణిచేసి వదలుతాడు. ఈయన కలం ఇంద్రజాలపింఛిక. కథను చూపుతుంది కాని చెప్పదు. ఈయన Patent హాస్యం ఎవ్వరికి సాధ్యమయినదికాదు.

బాణుడు "అగ్రామ్యపరిహాసకుశలైః" అన్నాడు. గ్రామ్యవచనాల్లో హాస్యం ఉంటే అది అనుచితం. అనుచితం రసభంజకం అని క్షేమేంద్రుడు.

వేంకటశాస్త్రిల్లుగారి ప్రసంగానికి, పానుగంటి వారిసాక్షికి ప్రజలలో చాలామంది మమకారపడతారు. కాని గ్రామ్యపరిహాసం జాస్తి.

భమిడిపాటివారి బాగయ్యాన్ని, పర్వతాలుని, నవ రసమూర్తిని, చూస్తే నవ్వకుండా ఉండలేము. ఎందు చేత ? తప్పనిసరికనక.

చిదంబరంగారి హాస్యం పెద్దబాడిశితివిసురు. ఎటు తగిలినా ప్రమాదమె. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి హాస్యం సహజంగాను సరళంగాను ఉంటుంది—అక్కడక్కడ కొంచెం చాదస్తంలేకపోతే.

గురజాడకవీంద్రునిహాస్యం చాలాపరిపక్వమైనది. సహజమైనది. సామాన్యజీవితాలలోంచే అమూల్యమైన హాస్యాన్ని ఉద్ధరించి పక్కనవుస్తాడు. ఈయనలో ఇంకొకవిశేషం. హాస్యంకోసమని ఎట్టి కృతకమైన వ్రాతను వ్రాయడు. ఏసమస్యనో ఎత్తుకొని రచన సాగుతూఉంటుంది. ఒకపక్కనించి ఉపాంగముగా హాస్యం పరిమళిస్తుంది.

"పరిహాసప్రసంగములేని వాక్యములు, గ్రాసము లేనికొల్వు కొరగానివి పెమ్మయసింగధీమణీ" అన్నట్లు.

దిద్దుబాటులో బోగంమేళం ఎంతస్థితహృదయుణ్ణయినా బోల్తావేయిస్తుందని దీనివలన విద్యావతుల హృదయాలు ఎట్లా feel అయ్యేదీని దానికి దిద్దుబాటున్నా ప్రధానవిషయం. దీనికి హాస్యస్పర్శ లేకపోయినా క్షతి

లేదు. నవ్వుళురును అందుకని సృష్టించలేదు. మళ్లీ రమ్మని చెప్పమని కబురుపంపడం మొదలయినవాటికి, ముఖ్యంగా వాడు కమలినీ, గోపాలరావులకు ఒక వ్యాఖ్యానం కనుక వాని ఉపయోగం వేరు. కాని వీని అమాయికపుగోలలోపడే wits కు కడుపు చెక్కలవుతుంది. చూడండి:

"మీా అమ్మేదిరా?"

"మాయమ్మా! ఇంటువున్నది బాబూ", "మీా అమ్మకాదురా బుద్ధిహీనుడా, నాభార్య."

"ప్రియా పోయి, అయ్యాకాడికి వచ్చేనా?"

"పెయ్యి పోయిందా బాబు" "మూర్ఖుడా, ఊరుకో."

"ఈదేశంలో పాండవులు ఉండని గుహాలు, సీతమ్మవారు స్నానంచెయ్యని గుంటలు లేవు."

"ఒకపెద్దగుహాలో ఉన్న బౌద్ధవిగ్రహమును శివుడని దానిప్రక్కనున్న దేవీవిగ్రహమును గౌరి అని భావించి జంగాలు పూజచేస్తున్నారు."

ఇట్లాంటివి ఈరెండవకథలోని మెరుపులు.

దీనిలో అప్పారాయకవి చంద్రుని శిల్పనైపుణ్యం మెచ్చుకో తగినది. హృదయంగమమైన హాస్యం కొంగుబంగారమై ఎత్తుకెత్తునా తూగింది.

ఈ ప్రథితానుభావునిగూర్చి ఎంతవ్రాసినను ఆ తృష్ణ కంతు ఉండదు. స్వభావోక్తికి మించదు. మాస పత్రికలయందును, ఉగాది సంచికలందును, ప్రకటితములైన వ్యాసములు జూచిన తద్జ్ఞులు ఈ నిర్వేలప్రతిభకు చకితులై తలలు త్రిప్పిరి. ఆంధ్రులు ఏనాడు ఆమేధావి రచనలనేకముఖముగా చూచి చూపించి గర్వించు నదృష్టము పట్టునో తెలియదు. వరుసల చినసీతారామశాస్త్రులవారివంటి ప్రాచీనపండితోత్తములు, రామమూర్తిపంతులుగారు, శివశంకరశాస్త్రిగారివంటి నవీనసారస్వతనీష్ణాతలు, కృష్ణశాస్త్రిగారివంటి రసవత్కవులు, ఈయ నవిశిష్ట ప్రజ్ఞకు మురియుచు హృదయపూర్వకముగా అంజలి చేస్తారు. వేయేల? అసాధారణుఁడు, నవ్యాంధ్ర సారస్వతమునకు శ్రీరాములుచుట్టిన ఆదికవి. అభినవ యువకులకు స్వాతంత్ర్యపు టూర్పుపోసిన పరమేష్ఠి.

---

# రెండు నక్షత్రాలు

అక్కడ రెండునక్షత్రాలు-ఆదివ్యతారకల కాంతిలో కరిగిపోనివాడు, తన్మధురహాసాలలో పులకించని వాడు నిర్జీవి. అందులో

'ఒకదానికాంతి - చక్కిలిగింత;
రెండవదానికాంతి - కౌగలింత;
ఒకదానిహాసము - పారిజాతవికాసము
వేరొకదానిహాసము - పండువెన్నెలసావాసము.

కాళిదాసు - భవభూతి

ఎట్టి అనుభూతు లూపుచున్నను, చెక్కుచెద రక సొక్కిసోలక, సొగసుమీద సొగసు, కైసేతమీద కైసేతతోను కాళిదాసు కనిపిస్తాడు.

ప్రేమ యాతనలోనో-ప్రియా వైధుర్యంలోనో బిక్కమొగం వేసుకొని వణకిపోతూ బావురుమని కని పిస్తాడు భవభూతి.

తెర యెత్తగానే ప్రేమవేదనా విషణ్ణుడయిన దుష్యంతుణ్ణి రంగంమీద ప్రవేశపెట్టి తానుగూడ ఒక

పక్కను నిలుచుని జాగ్రత్తగా కనిపెడుతూంటాడు కాళి
దాసు.

పూర్వం జానకితో తిరిగిన ప్రదేశాలు చూడడం
చేత తల తిరిగిపోయి "హా ప్రియే జానకి! అన్తర్లీనస్య
దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః, ఉత్పీడ ఇవ ధూమ
స్య మోహః ప్రాగావృణోతి మాం." అని నేపథ్యంలో
నుంచీ విరహాభుగ్నప్రాణుడై వచ్చి పాపం భవభూతే
రంగంమీద పడిపోతాడు.

దుష్యంతుణ్ణి చూడండి:

ప్రత్యాదిష్టవిశేషమండనవిధి ర్వామ ప్రకోష్ఠార్పితం
బిభ్రత్కాంచన మేక మేవ వలయం శ్వాసాపరక్తాధరః;
చింతాజాగరణప్రతాన్త నయన స్తేజోగుణా దాత్మనః
సంస్కారోల్లిఖితో మహామణిరివక్షీణోఽపిసంలక్ష్యతే.

ప్రత్యంగకంలోనూ విరహ వైక్లబ్యం చిత్రిస్తూ
ఎంతదూరానికైనాదుష్యంతుడు"క్షీణోఽపి సంలక్ష్యతే"
అంటాడు కాళిదాసు.

రాముణ్ణి చూడండి.

నవకువలయదళ స్నిగ్ధై రంగై ర్దద న్న యనోత్సవం
సతతమపి న స్స్వేచ్ఛాదృశ్యోనవోనవ ఏవ యః;
వికలకరణః పాండుచ్ఛాయః శుచాపరిదుర్బలః
కథమపి స ఇత్యున్నేతవ్య స్తథాఽపిదృశోఃప్రియః

ఆంగికంగా రాముడు మనకు గోచరించడు కాని మూడువిధాలుగా తల్లడిల్లుచుండగా చూస్తే గుండె తరుక్కుపోతుంది. ఎవరో తెలియనంత వికలంగా ఉంటే దగ్గరకు వెళ్లి మొహంమీద మొహంపెట్టి చూస్తేనేగాని మన రామభద్రుడని తెలియదు. వెంటనే ఒకబాధ ఊపుతుంది మనని. జాలితో గుండెలు కొట్టుకుపోతాయి.

"కథమపినఇత్యున్నేతవ్యః" అనేమాటతో భవభూతి ఒకమెట్టెక్కాడు.

ఇద్దరూ మహాకవులు-కావ్యతత్వజ్ఞులు- వివిధానుభూతులు జీర్ణించుకొని వేయివేయి యుగాలు మారుమ్రోగే దివ్యసంగీతం వెలయించిన పరిణత ప్రజ్ఞులు.

చేయెత్తి గాలిలో గీతలుగీసి కనులు మూసి తెరచునంతలో నవజీవలావణ్య మూర్తులను నడయాడించే శిల్పశిరోమణులు. కాని ఇద్దరి ప్రేమతత్వమూ ఆంతరతమ్యపరీక్షలో విభిన్నమవుతుంది. ఒకే ప్రేమ ఘట్టం ఇద్దరిదీ గమనిస్తే ఇద్దరి అనుభూతులలోనూ నిమ్నోన్నతాలు గోచరిస్తాయి.

దుష్యంతుని శకుంతలావియోగఘట్టంగాని, రతిమన్మథవియోగఘట్టంగాని, అజునిఇందుమతీవియోగఘట్టంగాని గమనిస్తే కాళిదాసుతత్త్వం తెలుస్తుంది.

కాళిదాసుపాత్రలు ప్రేమయాతనలో కుంగి కుమిలి ఉన్మత్తాలు కావు. ప్రేమానుభవాన్నిగాని, దానిబాధను గాని కాళిదాసు లౌకికంగా చూపుతాడు. పైగా "అవగచ్ఛతి మూఢచేతసః ప్రియనాశం హృది శల్య మర్పితం; స్థిరధీ స్తు తదేవ మన్యతే కుశలద్వారతయా సముద్ధృతం" అని గొణుక్కుంటాడు.

దుష్యంతుడు పశ్చాత్తప్తుడు. శకుంతలను నిష్కారణ నిరాకరణ విక్లబను తలచుకొని మనకిట్లా వివృతుడౌతాడు.

"పునర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీం
మయి క్రూరే యత్త త్సవిషమివ శల్యం దహతి మాం;
స్వప్నోను మాయాను మతిభ్రమోను
క్లిష్టంను తావ త్ఫలమేవపుణ్యం;
అసన్నివృత్త్యై త దతీతమేవ
మనోరథానా మతటాః ప్రవాహాః"

అని స్పందించి

"అచేతనంనామ గుణం నలక్షయే
మమైవ కస్మా దవధీరితాః ప్రియా"

వెలితిగొంతుతో ప్రశ్నిస్తాడు.

" జాత స్నేహే ప్రణయవా న్మృగతృష్ణికాయాం "
అని వెర్రిమాపు చూస్తాడు.

భవభూతి ప్రేమతత్త్వమే వేరు.

" ప్రియానాశే కృత్స్నం కిల జగదరణ్యాంహి భవతి "
అనే మూలసూత్రంమీద అతడు ప్రేయసీప్రియులను తిప్పుతాడు. ప్రేమాఘాతంలో నలుచుకుపోతున్న భవభూతిపాత్రలు అలౌకికంగా కనిపిస్తాయి.

కాళిదాసుపాత్రలను మనంచూడగలం. మనతో కలసిమెలసిఉంటాయి. కాని ఏదో అస్వస్థతలోఉన్న వాళ్ల మీాద కలిగే జాలే మనకు వాటిమీాద కలుగుతుంది.

"శయ్యాప్రాన్తవివర్తనైర్విగమయత్యున్నిద్రఏవక్షపాః"
అనివిన్న దుష్యంతుణ్ణిచూస్తే అయ్యోపాపం అనిపిస్తుంది.

" అనిర్భిన్నో గభీరత్వా దంతర్గూఢ ఘనవ్యథః,
పుటపాకప్రతీకాశో రామస్య కరుణో రసః. "
అంటే రాముణ్ణి చూస్తాం.

" తథావిధేష్టజన కష్టవినిపాతజన్మనా ప్రకృష్టగద్గదేన దీర్ఘశోకసంతాపేన పరిక్షీణో రామభద్రః — తమవలోక్య కంపిత మివ కుసుమ సమబంధనం ( అస్మాకం ) హృదయం "
అనుకుంటూ నిలవలేకపోతాం.

కాళిదాసు దుష్యంతుడు "చతురికే — అర్ధలిఖితమేతద్వినోదస్థానం—తస్మాద్గచ్ఛ వర్ణికాస్తావదానయ" అని, శకుంతలను చిత్రించుకొని అది చాలక సైకతలీన హంసమిధున ఐన మాలిని స్రోతస్విని మొదలయిన వానిని చిత్రించడానికి వరికరాలు తెమ్మంటాడు. అవన్నీ చూస్తో వినోదిస్తాడు. భవభూతి రాముడు అట్లాంటి వాటిని చూడలేడు. గుండెనీరయి పోతున్నదంటాడు. "తేషు దృష్టేషు కోపి ద్రవ ఇవ హృదయస్య ప్రస్రవోద్భేదయోగ్యః." వెళ్ళగా వెళ్ళగా రాముడు మన వాడు కాడు. భవభూతి, శ్రీరాముడు కూడ Mount Everest మీద ఉన్మత్తులై తిరుగుతున్నారు. మనం తల యెత్తి చూడలేము.

"జగజ్జీర్ణారణ్యాం భవతిచకళత్రేఽప్యుపరతే
కుకూలానాం రాశౌ తదనుహృదయం పచ్యత ఇవ"

ఇంతకంటె ఏమంటాడు.

పాపం! దుష్యంతుడు—

అహో! దుష్యన్తస్య సంశయ మారూఢాః పిండభాజః—అని ముగ్ధుడైపోతాడు. ప్రేమసుధదిమ్మరిల్లినా పితృదేవతల పిండాలకోసం నివాపాంజలులకోసం విలపిస్తాడు.

రామభద్రుడి కివేవీ అక్కరలేదు. భగ్నప్రణయం ప్రత్యావృత్తం కావాలి. తనకు జానకి కావాలి. ఆమె కోసం వెఱ్ఱిరాముడై పోతాడు. దళతి హృదయం శోకోద్వేగాద్ద్విధాతునభిద్యతే–కిముచ్యతే ధైర్యమితి–'నచరామోనజీవతి'–అని జీవితనైరాశ్యం చెప్పుకొంటాడు. ఉన్నట్టుండి లేచిపోతూ "అయి! చండి! జానకి! ఇతస్తతోదృశ్యసే నానుకంపసే." స్ఫుటతిహృదయం మోహాన్ధగయతి–కథం? మందభాగ్యః కరోమి? అని పిచ్చికేక లెడతాడు. తరువాత చదికిలబడిపోయి

'వ్యర్థంయత్ర కపీంద్రసఖ్య మపి మే
వీర్యం హరీణాం వృథా'

అని చేతులు దులిపేస్తాడు.

'తదనుజానీహిమాం గమనాయ'

అని నన్నెక్కడికో పోనీయమంటాడు.

ఈ కృపణజీవులను చూసేసరికి తమసా వాసంతి కలకు పట్టరానిదుఃఖం వచ్చింది. గుడ్లనీరు కుక్కుకుంటూ

'వితరతు భద్రం భూయసే మంగళాయ'

అంటూ వెళ్లిపోతారు; తెరజారింది.

ఇంకోఘట్టం

వాత్సల్యం పదోరసం అని కొందరు సాహిత్యవేత్తల నిర్వచనం. చంపూభాగవతానికి వ్యాఖ్యవ్రాసిన

అక్కయ్యసూరి వాత్సల్యానికి దశమరసత్వం నిర్ణయించినాడు.

ఇద్దరూ దీనిని చవి చూచినారు.

అది ఒక ఆశ్రమపదం. దుష్యంతుడు స్వర్గం నుంచి దిగాడు. ఆ ఆశ్రమంలో కాలుపెట్టాడు. (నేపథ్యమునుండి) "జృంభస్వ! సింహడింభ! దంతాంస్తే గణయిష్యామి" అని వినిపిస్తుంది.

దుష్యంతుడు—ఏమోగాని ఔరసపుత్రుని యందువలె ఈబాలునియందు నాహృదయం స్నిగ్ధం అవుతుంది. అవును అనపత్యతే ఇట్లా చేసింది (నూనమనపత్యతైవం వత్సలయతి) అని ఒక మెరపుమెరసినాడు. ఆదగ్ధహృదయంలో వాత్సల్యసౌరభపు గుబులుపెడతాడు.

'ఆలక్ష్యదంత ముకుళా ననిమిత్త హాసైః
అవ్యక్త వర్ణరమణీయవచః ప్రవృత్తీన్;
...తనయాన్.....వహన్తో...ధన్యాః'

రామదుష్యంతు లిద్దరికీకూడా ఆపిల్లయందు చక్రవర్తి లక్షణాలు కనిపించినవి. గతిస్థిత్యాసనాదులలో రాముడు చూచాడు జాలగ్రథితాంగుళి కరత్వంలో దుష్యంతుడు చూచాడు. భవభూతి చాలాగొప్పవాడు. ఒక్క చక్రవర్తి లక్షణం చెప్పితే చాలిందికాదతనికి. ఒక్కలక్షణం

నిర్ణాయకం అవుతుందా అని కాబోలు అతనిసందేహం. కనుక

'సామ్రాజ్యశంసినో భావాః'

అంటాడు. చిన్నతనమయినా

'వపురవియుత సిద్ధాఏవ లక్ష్మీవిలాసాః'

అని నమ్మిస్తాడు. దుష్యంతుడికీ రామచంద్రుడికీకూడ ఆపిల్లలమీద చెప్పలేని వాత్సల్యం కలిగింది. వారెవరాః? అనేసందేహంలో ఊగుతున్నారు. ఇక్కడ కాళిదాసు భవభూతి విడివడ్డారు. దుష్యంతుడుముందు—

"అయి! భోః! మహర్షిపుత్ర" అన్నాడు.

ఇతడు ఋషికుమారుడు కాడని ఎవరో చెప్పగావిని

"ఆకారసదృశం చేష్టితమేవ కథయతి - స్థానప్రత్యయాత్తు వయమేవం తర్కిణః"

అని ఆసందేహంలోనే ఆవులిస్తాడు. భవభూతి రాముణ్ణి ఎంత తమాషాగా దాటించేస్తాడో చూడండి.

"భూయిష్ఠంచ రఘుకులకౌమారక మనయోః పశ్యామి"

ఇంకో రెండడుగులు ముందుకువేసి

"(నిపుణం నిరూప్య) అహోన కేవల మస్మద్వంశ సంవాదిన్యాకృతిః—

అపిజనకసుతాయా స్తచ్చతచ్చానురూపం
స్ఫుట మిహశిశుయుగ్మే నైపుణోన్నేయ మస్తి"

అని రాముడు ఆపిల్లలను తనహృదయంలోకి లాగేసుకుంటాడు.

కాళిదాసు భవభూతి వరుగందుకోలేదు.

ఇద్దరూ ఆ బాలకులను కౌగలించుకొన్నారు. దుష్యంతుడు—(బాలస్పర్శన సుఖ ముపలభ్య ఆత్మగతం) అనేన కస్యాపికులాంకురేణ స్పృష్టస్య గాత్రేషు సుఖం మమైవం, కాం నిర్వృతిం తస్య జనస్య కుర్యాత్, యస్యాయ మంగా త్కృతినః ప్రరూఢః." అని చప్పగా అనుకున్నాడు.

రాముడు—పరిష్వజ్య (స్వగతం)

అంగాదంగాత్సృతఇవ నిజస్నేహజో దేహసారః
ప్రాదుర్భూయ స్థిత ఇవ బహిశ్చేతనాధాతు రేకః;
సాంద్రానందక్షుభిత హృదయ ప్రస్రవేణావ సిక్తః
గాఢాశ్లేష స్సహి మమ హిమశ్చ్యోతమా శంసతీవ."

ఆహా! ఈపద్యం వ్రాయడానికి కవి చక్రవర్తి ఎంత ఆవేదనపడ్డాడో, ఎంత బాధ అనుభవించాడో కదా!

హృదయపుటాన్ని చీల్చుకొని పొంగివచ్చే ఒక దివ్యానుభూతిని, ఒక ఆఘ్రాణాన్ని తన అమృతకోశంలో ముద్రించాడు. యుగయుగాలు సారస్వతాకాశంలో రింగుమని మార్మోగే జీవగీతాన్ని తనగొంతు అమృత నాడులు కదిపి ఆలపించాడు.

"ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అంటారు పెద్దలు.

---

# "శబరీ" సమాలోకనం

కావ్యవిమర్శ అంటే కత్తికోతా కాదు. గంధానులేపమూ కాదు. సమీక్షాపూర్వక తత్వ మీమాంస.

బసవరాజు శక్తిలో బాగాలేదంటే ఆహా అన్న వారు కొందరూ అబ్బే అన్నవారు కొందరూ ఉన్నారు.

ఆంధ్రపత్రికలో అభినందనం ఒకటి వినిపించింది. అభినందనపు టుబలాటంలో ఆంతరతమ్యా పరీక్షకి అవకాశం చిక్కించుకోలేదు. ఆయ నెవరో.

రామకృష్ణశాస్త్రిగారి మాటల్లో తత్వస్పర్శ ఉంటుంది. కాని ఈశబరి విమర్శ స్థూలదృష్టితో దొరిలింది.

ఈపుస్తకంగురించి ఏమైనావ్రాయాలని కొన్నాళ్లనుంచి కోరిక. ఇప్పటికివచ్చిన విమర్శలు నేననుకొన్నట్టు లేవు.

కనుక నా అవకాశం సదుపయుక్త మయితే దీనిని సమాలోకనం అనండి.

ఆంధ్రపత్రికలకు క్రొత్తగా అందినరూపకం 'శబరి'. దీనిని నాటకం అనడం దీక్షితులుగారి కిష్టమో కాదో తెలియదు. కాని పుస్తకంమీద (శబరి 7 అంకముల నాటకం) అని ఉన్నది.

ధనంజయుడు నాటకానికి గీసినగీతలు చాలా జిలిబిలిగా ఉన్నవి. మొదట పూర్వరంగం విడిచిపెట్టి సూత్రధారుడు వెళ్లగానే అట్లాంటివాడే ఇంకొకనటుడు ప్రవేశించి కావ్యము నాస్థాపించాలి. దీనినే స్థాపన అన్నాడు భాసర్షి. ప్రరోచన—ఆముఖం, కనిపించాలి. వీరశృంగారాలలో అన్యతరం అంగికావాలి. సంధ్యాదికం చాలా ఉన్నది. ఈహద్దులు మధ్యస్థంగా ప్రవృత్తమయిన దృశ్యకావ్యమును నాటకం అనమన్నాడు. దృశ్యకావ్యములను బాగా పరిశీలించి విభజించి తన పరిశీలనాఫలంగా ఒకొక్కజాతికి ఒకొక్క నిర్వచనం చెప్పినానని అతని నమ్మకం. అందుకనే "పరిభావ్య కవి ప్రబంధాన్" అన్నాడు.

ఆంధ్రపత్రికలో శబరికి నాటకలక్షణము లున్నవని అభినందనకారకుని మాట లున్నవి. యాదృచ్ఛికంగా ఒండురెండు కనిపించినను అవి నాటకత్వనిర్ణాయకములు కావు. నాటకలక్షణాలు తెలిసినవా రెవరూ అట్లా అనరు.

ధనంజయుని కొలతబద్దతో ఇప్పటి అభిరుచుల తోనూ ఆదర్శములతోనూ కొత్తగా విస్తరిల్లిన కావ్యమును కొలవడం అర్థంలేనిపని. నిజమే. ఇట్లాంటి అభినవ కావ్యములను, ఆ పేరుతో వ్యవహరించడం కొన్ని శతాబ్దాలు వెనక్కి తొంగిచూడడం. అప్పుడు ఆయాలక్షణ జిజ్ఞాసలు అవసరమయినట్టు కనిపిస్తాయి. ఆసూత్రాలు వీటికి అతకవు. అప్పుడు నిరర్థకమైన కోతలుకోసి పూతలు పూయవలసి వస్తుంది. పూర్వులకూ మనకూ అభిరుచులలోనూ ఆదర్శములలోనూ బ్రహ్మాండమయిన భిన్నత్వం వచ్చేసింది. కనుక వారిలో ఇమడడం మానివేసి ప్రత్యేకతను ప్రదర్శించాలి. కనుక దృశ్యకావ్యమాత్రమునకు చెందే రూపకం అనేపేరుతో శబరిని వ్యవహరించడం ఎక్కువ సమంజసం అవుతుంది.

దీక్షితులుగారు తెలుగును మోగించి నాణెపు పలుకుబడిని విని, వినిపించిన సిద్ధహస్తుడు. కథలు రాసి రాసి చేవలుదీరిన చెయ్యి. సగుణోపాసనలో సత్యసాన్నిధ్యమును నమ్మినభక్తుడు. అట్టిశబరి ఆత్మౌన్నత్యాన్ని అవ్యాజభక్తిని ఆశించిన ప్రారంభశిల్పి.

రామాయణంలో అరణ్యకాండలో డెబ్బదినాలుగవసర్గలో 36½ శ్లోకాలప్రవృత్తి ఈరూపకానికి ప్రకృతి

'తైశ్చాహముక్తా ధర్మజ్ఞైః మహాభాగై ర్మహర్షిభిః,
ఆగమిష్యతి రామః సుపుణ్య మిమ మాశ్రమమ్,
స తే ప్రతిగృహీతవ్య స్సౌమిత్రి సహితో ఽతిథిః,
తంచదృష్ట్వావరాన్ లోకాన్ అక్షయ్యాన్ త్వం
గమిష్యసి.'

ఈగీతలికి రూపంఇచ్చి రంగులువిసరి వికాసం అతికిలం చులుదిద్దిన రూపకం శబరి.

మతంగమహామునివనం.—అందులో ఆశ్రమం.—ఎప్పుడేనా దీక్షితులుగారు చూశారా అనుకోవాలి.

ఉపదేష్ట—మతంగమహర్షి.

ఉపదిష్ట—శబరి.

శబరిహృదయకేదారంలో రామభక్తి బీజములు అవక్తములయిన తొలుకారు హృదయంగమంగానే ఉన్నది. కాని మహర్షుల ఉపదేశంలో ఉండవలసినఅనుస్యూత గాంభీర్యం మతంగుని మాటల్లో కనిపించదు. ఎంతజ్ఞానంలేని సవరజాతి అయినా " ఇంతకాలమూ చేసిన సాధన ఈరోజున మంటకలుపు " తుందా? ఎంత ఆవిష్టులయినా చెప్పినది పరిమితంగాను అవసరం అయినంత వివృతంగానూ ఉంటే పఠితలకు విసుగు పుట్టదు.

సాగినకొద్దీ వస్తువు పలచనవడం జరుగుతుంది. మన పూర్వప్రబంధాలు కొన్నిటిని విమర్శకులు గర్హించినది ఇందుకే. వసుచరిత్రలో వస్తువుతక్కువ. వర్ణనఎక్కువ.

ఇర్రి—హనుమంతుడు

ఈపాత్రసృష్టిలో కవి ఉపజ్ఞ ఎదురు పడుతుంది. కాని ఉపజ్ఞవెన్నంటి ప్రతిభనడవాలి. అప్పుడు కావ్యము కవీ, రసజ్ఞుల హృదయాన్ని సూటిగా పట్టుకోగలుగుతారు.

ఇర్రి అంటే దీక్షితులుగారి హృదయం. ఆయన ప్రకృతి సౌందర్యలోలుపత ఈసవరకన్యకగా మారక తప్పినదికాదు. ఈమె ఆటకు పంపాతట ప్రకృతికి దగ్గరగా హనుమంతుడు తప్ప గోచరించలేదు. Everest మీద మనం చూస్తున్న హనుమంతుణ్ణి పచ్చికబయలునకు దించి అమాయికంగా ఆడించారు దీక్షితులుగారు. పంప ఒడ్డునికూర్చుని చూడడానికి బాగుంది. ఇవతలకు వచ్చి; తన బాల్యదశలోనే, సూర్యు నుపాసించి శాస్త్రాభ్యసనం చేసిన మహావిచక్షణుడు, సుగ్రీవరాజునకు కార్యాకార్యము లుపదేశించే నిరంతర రాజకార్య నిర్వాహకుడు, ఆజన్మబ్రహ్మచారీ ఇర్రిచేతిలో బంతి అయిపోయాడేమో అనిపిస్తుంది.

భీష్ముడు ఒక గంధర్వాంగనతో నందనారామంలో విహారిస్తున్నాడని చదివి ఎట్లా Feelఅవుతామో.

ఇంతకు ఝుణంకిందట వారి ఆటచూసి సంతోషించాంకదూ? అన్నేప్రశ్న, తారసిల్లింది. మనం సంతోషించడం కాదది. కవి ఉపజ్ఞకు ఆశ్చర్యపడ్డాం. కొత్త. ఒకవింత.

ఎవరో ఇంకొక ఋషికుమారునకు ఇద్రితో ఆటా, స్నేహం పెట్టి ఈసంవిధానం ప్రతిభావంతం చేస్తే ప్రశ్నలకు అవకాశం ఉండదు. అమర్చిన రూపక రీతికి అడ్డు ఉండదు. హనుమంతుని రామభక్తి శ్రీరాముని చూచిన వెనుక పుష్టమయినది. కనుక అతని అవసరం లేదిప్పుడు. ఈ మార్పులో రామాయణానుస్మృతి కూడివస్తుంది కూడ.

పతాకావృత్తం ప్రధానకథను విస్మృతం కానీయగూడదు. క్రమవికస్వరమయిన రూపకేతివృత్తమునకు పతాక ఉపస్కారకము.

ఇద్రీ హనుమంతుడూ పాడుకుంటూ ఆడుకుంటూ ఉంటే చాలాసేపు వారినేచూసి శబరిని మరిచిపోయినాం. తుదకు ఇద్రి "ఆముసలిఅవ్వ ఎవరో" అంటే అన్నా! ఇది శబరిరూపకం కదూ అనిపించింది. కాని ఇద్రీహను

మంతుల ఆట, పాటల చిత్రణం కవి సౌందర్యప్రవణతను అభివ్యక్తంచేస్తూ చక్కగా అమరింది.

ఇర్రి హనుమంతుల స్నేహప్రవృత్తి చూడగా చూడగా ఒకసమస్య తలయెత్తుతుంది.

అప్పుడు హనుమంతుణ్ణి ఒక ఋషికుమారు డంటాను.

ఆఋషికుమారుడు :—(ఆమె వెనుక పరుగెత్తుకు వెళ్లి ఒకచేత్తో బుజంమీద పెట్టుకువచ్చును)

ఇర్రి :—"నన్ను ముద్దెట్టుకుంటే పాడతాను."

అతడు యువకుడు — ఆమె యువతి.

ఈస్నిగ్ధహృదయాలలో దాంపత్యవాసన ఉన్న దని విమర్శకుడు తలచినాడు. లేదంటాను నేను. ఆ ముగ్ధవాతావరణంలో ఈ ప్రశ్నకు చోటులేదు. ప్రకృతిసౌందర్యం ఉపాసిస్తూ అనుభవిస్తూ నిత్యానందంలో మునిగిపోతారు ఇద్దరూ. ఈ ప్రపంచపు ప్రాలి మేరలు దాటిపోయారు. మనప్రశ్నలకు వారు అందరు.

## సాధన — పరివర్తన

అనేవిభాగాలలో తొట్రుపాటు కనిపిస్తుంది. "సాధన"లో శబరి హనుమంతునితో తన నిరవధిక ప్రప

త్తిని సాధన చేసుకుంటూ అతనిని తనలోకి లాక్కుంది. అప్పుడందులో సాధన—పరివర్తనా కూడా ఉన్నవి. అయితే నాయిక సాధనకే ప్రాధాన్యంకలిగి ఆప్రకరణం అట్లాముద్రితమయిందంటారా? తరుఎ-ంవిది అయిన పరి వర్తన ఎవరిలో కలిగింది? ఇర్రిలో. ఇందులో హను మంతుడు ఇర్రితో భగవద్భక్తి సాధన చేసుకున్నాడు. ఇప్పుడీప్రకరణం ఏనామంతో అంకితం కావలసి ఉంటుం ది? ఇందులో ఉన్న పరివర్తనా సాధనాకూడా అప్రధాన ములే అయి శబరికి సంబంధించనప్పుడు దీనికి ఈపేరెట్లా తగుతుంది? మరియు—ఉపదేశము—సాధన—నిరీక్ష ణము—సిద్ధి—అనే నాలుగిటితో శబరికి సంబంధంఉంది. కాని ఈపరివర్తనతో బొత్తి గాలేదు. దీక్షితులుగారు ఏఊహాతో ఇట్లా చేశారో తెలియదు.

"నచాతిరసతో వస్తు దూరంవిచ్ఛిన్నతాం నయేత్."
—ధనంజయుడు.

అతివేలరసావేశం కావ్యమునకు ఔన్నత్యం కూర్చదు. దీనితో వస్తువులో ఉండేబిగువు సడలిపోతుంది. "యద్యపి రసః పునఃపున రనుభవయోగ్య ఏవ తథాపి అపరిమిత ఆనందభంజక ఏవస్యాత్."

. పువ్వు వాసన చూసిన కొద్దీ నలిగినలిగి వాడు వాసనకొడుతుంది కదూ!

ఈరూపకంలో ఇతివృత్తం చాల తక్కువ కనుక ఆదినుంచి అంతంవరకూ శబరి భక్తి భంగ్యంతరాల చాద స్తం మెలికలు దిరిగింది. 'సిద్ధి' లో ఇది ఒకపాలు ఎక్కువ. దీనికి కొందరు మెచ్చుకొన్నారు. "భిన్న రుచిర్హి లోకః"

శబరిని రూపకం అన్నాం. కనుక రూపించవలసిన అవసరం ఉంటుంది. కాని దీనికి ప్రదర్శనయోగ్యత కని పించదు. ప్రదర్శనమునకు అననుకూల దృశ్యములు చాలా ఉన్నవి. పావురాల సందేశం, పక్షుల పాటలు, హనుమంతుడు అమాంతంగా ఇద్దరిని ఎత్తుకోడమూ మొదలయినవి. ముఖ్యముగా ఇతివృత్తములో దర్శ నానుకూల వైశాల్యం లేదు రెండురంగాలు కాగానే దిదృక్షమందగిస్తుంది. ఇట్లాంటి రూపకాలు సంస్కృత వాఙ్మయంలో లేవని చెప్పవచ్చు. కొంచెం సంస్కృ తితో అవి ఆడడానికి సిద్ధపడతవి.

ఇట్లాంటిరూపకాలు వాఙ్మయాంతరాలలో కద్దు. మాటరులింకు రూపకాలు కొన్ని ఇట్లాంటివి. ఇవి చదువు కోడానికే ఉపయోగిస్తాయి.

దీక్షితులుగారి కొన్ని రచనలు జీవకళతో మెరి శాయనడంలో నాకేమీ విప్రతిపత్తిలేదు. కథలు రాయ డంలో ఘనాపాటి.

కాని......రూపకరచనా సమీక్షలో “ అన్ని టికీ నాయకమణిగా...నిరూపింపవలసి ” రావడం విమ ర్శలకు గురి అవుతుందేమో. తెలుగులో ముందు రాబోయే ఉత్తమరూపకములకు ‘ శబరి ’ పూర్వరంగం అనమంటే అభ్యంతరములేదు.

# 'వకుళమాలా' పరిశీలనం

"A Poet is born but not made"

---

'వకుళమాల' అని ఒక ఆధునికకృతికి చెందిన పేరు. దీనికి నిజమైన అర్థం పొగడదండ. దీనిని కూర్చి కూర్చి 'సహదేవ సూర్యప్రకాశరావు' అనేవారు 'అచ్చమాంబ' మెడలో అభినవంగా అలంకరించినారు.

అయితే "ఆమె లోకమ్ములో లేదు" లెండి.

ఈ గ్రంథమును మనకు పరిచితం చేసినవారు శ్రీ చింతా దీక్షితులుగారు. "పరిచయము" చదివితిని. పుస్తక ప్రధానభాగం చదివితిని. పువ్వులన్నీ కదిపి చూచితిని. వాసనాలేశంగూడ లేదు. పరిచయ వాక్యాలు సమన్వయించ బోయినాను. కుదరలేదు. విచారించగా అవి "మిత్రునిమాట త్రోసివేయలేక" - సందేహించి వ్రాసినట్లు కనిపించినవి. దీక్షితులుగారి వంటి సహృదయుని కలంలోంచి నిజాన్ని జారనిచ్చింది కాదు, మొహమాటం.

సాధారణంగా ఆధునికకవిత్వాన్ని తిట్టేవా రందఱుగూడ ఇలాంటిపుస్తకాలు చూసే తిడతారని నా అభిప్రాయం.

మాస్తే ఇనుం—మెఱిస్తే బంగారం అనుకునే ముగ్ధహృదయాలకు వీని తాత్త్వికాంశం తెలుపుదామనే ఉద్దేశంతో నే నీవిమర్శకు మొదలుపెట్టినాను. నన్ను సమంగా అర్థంచేసుకోగలిగినవారికి నా మాటలలోని యథార్థం బోధపడుతుంది. మిగిలినవారు—అలగనీ—అలరనీ—ఒక్కజోహారు.

ఉమాకాంతంగారు " నేటికాలపుకవిత్వం " లో అన్ని విషయాలూ చర్చిస్తూ ఇప్పటి పుస్తకాలపేర్లను గూడ ' నామాధికరణం ' అనేపేరుతో విమర్శించినారు. ఆయనమాటలలోని వెగటుదనం—దబాయింపు వదలి పెడితే కొంతవఱకు యథార్థం లేకపోలేదు. పెట్టినపేరు అన్వర్థం అయిఉండాలని ఆయనవాదం. చాలామట్టుకి ప్రస్తుతపుస్తకాలపేర్లు సార్థకంగా లేవు. ద్రావిడప్రాణాయామం చేసిచూస్తే ఏదో లీలగా కనిపిస్తుంది.

తమరచనలకి అందమయిన పేర్లుపెట్టడం సంస్కృత వాఙ్మయంలో ఉన్నది. దిఙ్నాగుని నాటకంపేరు ' కుందమాల '. అయితే చాలభాగం కుందమాలమీద ఆధారపడి ఉన్నది, నాటకం.

వ్యాఖ్యానాలకి చిత్రమైన పేర్లున్నవి. ప్రతాప రుద్రీయమునకు కుమారస్వామి సోమపీథి వ్రాసిన వ్యాఖ్యానం పేరు 'రత్నాపణం'. ఉత్తరరామచరిత్రకు వ్రాసిన ఒక వ్యాఖ్యానంపేరు 'కళ', కాని కావ్యాలకి ఇట్లాంటివి లేవు.

'వకుళమాల' అనే పేరు అందంగానే ఉన్నది. కాని గ్రంథానికి—పేరుకి సంబంధం లేదు. వీరి పూర్వ గ్రంథం—'మునిమాపు'. దీనికి పుస్తకానికి అన్వయం మృగ్యం.

ఈయనకు మేలుబంతి శ్రీకృష్ణశాస్త్రి. ఆయన మొదటి గ్రంథం 'కృష్ణపక్షము'. రెండవది-'ప్రవాసం-ఉర్వశి'. ఈ పేర్లుచాలా అర్థవంతములు. అంధతమసావృతమైన బహుళపక్షంవలె దుఃఖబహుళ కావ్యావృతం గనక కృష్ణపక్షం అని పేరు తగిఉన్నది. చాలవఱకు ఆత్మ పరం గనకనూ కృష్ణపక్షం అనవచ్చు. రెండవ గ్రంథం పేరు సర్వథా అర్థవంతమని ఆ గ్రంథం చదివిన అందఱికీ తెలుస్తుంది. అందమైనపేరు వెదకి అమర్చే ఆరాటం ఇక తగ్గించి అర్థంకూడా చూడాలంటాను సూర్య ప్రకాశరావుగారిని.

కవిబ్రహ్మకి నిజమో, అబద్ధమో మన ఖర్మం చాలక ఓ కల వచ్చింది. ఆషాడురోజు మొదలు ఎడ

తెలుపి లేకుండా కలమెత్తి కందపద్యాన్ని పిలవగలిగిన, ప్రతి కవిశేఖరుడికీ కలలు రాకతప్పినది కాదు. అందు లోనూ కూచిమంచి తిమ్మరాజుగారికి కుక్కుటేశ్వర స్వామి రోజూ కనిపించి వ్రాయబోతున్న ప్రతిప్రబంధాన్ని తన కిమ్మని దేవిరించని ఘడియ లేదు.

కృష్ణశాస్త్రి పాపం నిజంగా బాధపడి వ్రాస్తాడో—లేక భావించి వ్రాస్తాడో, ఆ విషాదకవిత్వం ఆయనకు చెల్లినది. ‘కృష్ణపక్షం’లో కంటె ‘ప్రవాసం-ఊర్వశి’ లోని ‘శాస్త్రిని’ చూస్తే “అపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్” అనుకుంటాను.

వేదుల శాస్త్రిగారు గూడ కొంతవఱకు విషాద కవిత్వమే వ్రాస్తారు. అందులోనూ హృదయం సుఖ స్తుంది. వీరిరువురి గీతాల్లో ప్రత్యేకత గోచరిస్తుంది.

ఇంక యువకవులలో విషాదకవిత్వపు వెఱ్ఱి రేగినది. లేనిపోని కలత లేవో రేపుకొని అర్థంలేని అయోమయం మొదలుపెట్టినారు. నేటి కవిసోదరులు. రాను రాను వీరందఱిని చూస్తే జాలి అనేది పోయి ఆంధ్ర వాఙ్మయానికి అమాంతంగా ఇంత అవస్థ వచ్చినందుకు ఆశ్చర్యపడవలసివస్తున్నది. తెలుగు బ్రదుకు కల అయి పోయిందనే శోచించమా, అర్థంలేని అయోమయ

దుఃఖంలో అణిగిపోతున్నదనే అలమటించమా, అర యండి పెద్దలు.

విషాదకవిత్వపు శాఖకు చెందినదే 'వకుళమాల' గూడ. కృష్ణశాస్త్రిగారిని వెంబడించినవారిలో ప్రకాశ రావుగారు ప్రథములు. కృష్ణశాస్త్రిగారిలో ఉండే ఆవే దన, అభిప్రాయాభివ్యంజకపదసామగ్రి, ఉపజ్ఞ, అద్భుతప్రతిభ వీరు స్పృశింపలేక పోయినారు. అలవ ఱచుకొన్న వేమిటంటే—ఆయనలో ఉండే విసంధులు, గణయతిభంగాలు, అన్వయకార్కశ్యాలూను.

"పరిచయ" కారులు "వకుళమాలలో స్వాదు త్వమున్నదని నా అభిప్రాయము" అంటారు.

స్వోపజ్ఞాప్రతిభాసముస్మేషంవల్ల కవిహృదయం లోనుంచి కావ్యం వికసిస్తుంది.

ఆచార్యమమ్మటుడు "నియతికృత నియమరహి తాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం, నవరస రుచి రాం నిర్మితి మాదధతీ భారతీ కవేః..." అన్నాడు. "యథాస్మై రోచతే విశ్వం తథేదంపరివర్తతే" అని ఆనందవర్ధనుడు కవి అనంతప్రజ్ఞకు ఈవిశాల విశ్వం ఒదిగిపోతుం దన్నాడు.

"నాహృదయమందు విశ్వవీణాగళమ్ము
ఘోరుఘోరున నీనాఁడు మ్రోఁతవెట్టు,
మూఁడులోకాలసుఖ మొక్కముడి నిమిడ్చి
విసరలేనొ కాలాంతమే వెనుకఁబ్రాఁక."

అని నిజమైనకవి ఆవిష్కృతు డౌతాడు. కవిమై పుడితే ఈతత్త్వం ప్రకాశించకమానదు.

ఆధునికాంధ్ర సారస్వతంలో, కృష్ణశాస్త్రి, నాయని, రాయప్రోలు, విశ్వనాథ ఆదిగా అరుదుగా ఉన్నారు, కవులు. కాకిబంగారం మెఱుపుతో కూర్చిన పద్యసంపుటమును కావ్యం అనమంటే అనలేం.

వకుళమాలలో ప్రధానంగా వర్ణింపబడినది కరుణవిప్రలంభము.

కవులు విప్రలంభంఅంటే కరగిపోతారు. కాళిదాసు విప్రలంభసమాశ్లిష్టకథలనే తీసికొని ఆరుకావ్యములుగా విరచించినాడు. తత్రాపి, మేఘదూత కేవల విప్రలంభచిత్రణం కొఱకు ప్రత్యేకింపబడినది. భవభూతి విప్రలంభరసాంబుధిలో మునిగితేలి ఇంతలో తున్న దని కణేహాత్య చెప్పినాడు. కృష్ణశాస్త్రి 'ప్రవాసం-ఊర్వశి' లో విప్రలంభం కూలమ్ముదుజమై ప్రవహించినది. వీరం దఱిలోను ఉపజ్ఞ—ప్రతిభ వెల్లివిరిసినది.

వకుళమాలలో విప్రలంభం నీరసంగానూ, చేద స్తంగానూ వర్ణితమైనది.

ఇంతగ్రంథములోనూ ఉజ్జ్వలమైన పద్యాలు రెండుమూడైనా ఉన్నవా లేవా అంటే, లేవనే నాఅభిప్రాయం. ఏమంటారా—

"కవిత్వం దుర్లభం లోకే శక్తిస్తత్ర సుదుర్లభా" అన్నాడొకసహృదయుడు. ఆశక్తినే నేను ప్రతిభఅంటున్నాను. ఈప్రతిభ ప్రతి Versifier లోనూ ఉండదు. ప్రతిభ ఉపజ్ఞాజన్యం. ఆ ఉపజ్ఞ పరమేశ్వర కరుణాసమాసాదితం కావలెను. ఈగ్రంథంలో ఉపజ్ఞ, ప్రతిభ లేనే లేవు. ఉన్నవారి ఉదాహరణములు చూడండి.—

"హృదయే వససీతిమత్ప్రియం యదవోచ స్తదవైమి కైతవమ్, ఉపచారపదం న చేదిదం త్వ మనంగః కథ మక్షతా రతిః. అహమేత్య పతంగ వర్త్మనా పునరంకాశ్రయణీ భవామి తే." —కాళిదాసు.

"అంతర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః,
ఉత్పీడఇవధూమస్య మోహః ప్రాగావృణోతిమామ్."
—భవభూతి.

"ఎవ్వడే నీగళమ్మునం దిరవుకొనగ
నేను విసరిన ప్రేమప్రసూనమాల

నడుమ నీవు చూడగ బట్టి నలిపివైచి
నీకనులయందు నెత్తురుల్ నింపినాడు."

—నాయని.

"ఏను మరణించుచున్నాను, ఇటు నశించు
నాకొఱకు చెమ్మగిలునయనమ్ము లేదు
పసిడివేకువ పెండ్లింఢ్ల బడిన యెవరు
కరగనేర్తురు జరటాంధకారమృతికి."

—కృష్ణశాస్త్రి.

ఉదాహృత పద్యము లన్నిటిలోని విప్రలంభ తత్త్వం గమనించండి. పద విన్యాసమునందు, భావా విష్కరణమందు ఒకొక్క కవిలో ఒకొక్క మెఱపున్నది. ఇంక వకుళమాలలో సమానభావం గలిగిన పద్యం చూడండి—

"ఏల మరణించిపోను న న్నేల నిపుడు
చుక్కలే చిరుమెఱుపులే సొగయబోని
కటికకాటుక చీకటి కవయు దేమి
మీదపడ దీముహూర్తాన మిన్ను విఱిగి."

ఈపద్యంలో Expression కుంటువడినది. లేవడి-తనం పొడకడుతుంది. చూడండి. మొట్టమొదట ప్రక్రమభంగం కనబడుతున్నది.

"ఏల మరణించిపోను, ఏల కటికకాటుకచీకటి కవియదు, (ఏమికూడా ఎందుకో) మీదపడ దీ మహార్తాన మిన్నువిరిగి"—దీని ముందుగూడా 'ఏల' ఉంటే ప్రక్రమం పాడుకాకపోను. అందం మందగించకపోను.

"దళతి హృదయం శోకోద్వేగా ద్ద్విధాతు నభిద్యతే

*　　*　　*　　*　　*

ప్రహరతి మహు ర్మర్మచ్ఛేదీ నకృన్తతి జీవితమ్."
అని ప్రక్రమం పాటిస్తాడు నిజమైన కవి.

అనర్థకము—

"చుక్కలే చిరుమెఱపులే సొగయబోని"

చుక్కలేని, మెఱపులేని అందగించని, లేదా పాడసూపని అనే అర్థం ఇక్కడ కావలెను.

"సొగయు = చొక్కు—మూర్ఛిల్లు."
—శబ్దరత్నాకరము.

కనుక ఇక్కడ ఈమాట అనర్థకము. ప్రధానంగా విప్రలంభకావ్యంలో కనిపించవలసిన హృదయాన్ని ఊపే ఆవేదనపరిణతి ఇందులో లేదు.

క్రమముగా వికసించవలసిన భావస్ఫూర్తి యీ పద్యమున కలతవడ్డది. 'నేనేల మరణించిపోను కటిక...

చీకటి కవియ దేమి ? మిన్ను విరిగి మీదపడ దేమి ?' అని పద్యార్థం.

ఉద్బుద్ధమైన భావం పైపైని ఆవిష్టమవుతుంది కనుక—

'కటికచీకటి నన్నావరింప దేమి ? మిన్ను విరిగి మీదపడ దేమి ? మరణించిపోనేమి ?' అంటే భావో న్మీలనం క్రమవిన్యస్తమవుతుంది. ఐనా 'మరణించిపో నేమి' అనే మాట నీరసమైనది. 'మిన్ను విరిగి మీదపడ దేమి ?' అనేమాటతో భావావిష్కరణం వ్యంగ్యంగా మనస్సునకు నాటుకొంటుంది. "కాటుకచీకటి" అనే మాట చప్పగా ఉన్నది. 'కారుచీకటి' అని గణం సర్దు కుంటే బాగుండును. నిజమైన కవులను చూడండి.

"ఏను రుజానైతి జరనైతి. మృత్యునైతి".

"అంధే తమసి విధురో మజ్జతివాంత రాత్మా
విష్వ జ్యోత్స్నాః స్థగయతి...............''

ప్రధానంగా ఈ పుస్తకంలో అర్థవ్యక్తి లేదు. అర్థవ్యక్తి లేకపోతే అయోమయం అనవలసివస్తుంది.

పండితరాయలు 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్' అన్నాడు. ఉద్బుద్ధమైన భావం శబ్దముల ద్వారా ఆవిష్కృతమవుతుంది. ఆశబ్దములు అర్థప్రతిపా

దకములు కావలెనుగాని అయోమయంగా ఉండరాదు. ఒక పాశ్చాత్యలాక్షణికుడు 'Poetry is the best words in right order' అన్నమాటలోని తత్త్వం గమనించండి.

"కీటానువిద్ధరత్నాది సాధారణ్యేన కావ్యతా,
దుష్టేష్వపి మతా యత్ర రసాద్యమగమస్స్ఫుటః."
అని ఒక కావ్యతత్త్వజ్ఞు డంటాడు.

వకుళమాలలోని అర్థవ్యక్తిని చిత్తగించండి—
"ఈ కిశోరతారాహ్లాది సోకుచుండు"

కిశోర=యౌవనావస్థగలిగిన—ఇది హ్లాదయము నకు విశేషణము. మిగిలిన, 'తారా' ఇక్కడ ఏవిధము గాను అతకదు.

దీనికి నిజమైన అర్థం: బృహస్పతిభార్య, వాలి భార్య, నక్షత్రము, కనుగ్రుడ్డు. వీనిలో ఏది పైస్థలంలో సమర్థార్థమును ఇవ్వగలుగుతుంది? ఇది అచ్చమాంబగారికి అంకితమిచ్చే ఆదిమపద్యం. కలయద్రిష్ట స్వప్నన్న పితరహా స్త్రీరములను రహస్థలములు తడిసినవా? దేని చేత? కలలో తడియడానికి కారణం ఏమిటి (? పూలక న్నెవలపు) ఇట్లా తడిసిపోయిన, కలల రహస్యతీరము

లలో లేక తీరములను కలయద్రిప్పడానికి కలిగిన ఆంతర కారణం ఏమిటి ?

ఏమో, అంతా అయోమయం.

" నూత్న చైతన్యసుషిమామనోజ్ఞశోభ".

' చల్లనిశోభ ' అనిగాని, ' చల్లదనపుశోభ ' అని గాని దీనికి అర్థము. శోభకు చల్లదనం, వెచ్చదనం అనే భౌతికగుణా లేవీ ఉండవు. లేక చల్లదనానికి మనోజ్ఞశోభ ఏమిటో తెలియదు. ' నందనానందకుంద మరందలవము ' అను ప్రాసకే ఆనందమా? అర్థపుష్టి అక్కర లేదూ ?

ఇట్లా ఉదాహరించదలచుకుంటేవకుళమాలంతా ఇక్కడ వ్రాయడమే అవుతుంది. ఇది దిఙ్మాత్రోదాహృతిగా గ్రహించండి :

కొన్ని పద్యములను చూడండి:—

" చెక్కిళుల పసందుల కళాసించి పోయి
సొలసిపోయిన ఇసిరింత చూపుకొసల
కొనలుదేరిన కడసారి మినుకుతలపు
ప్రొద్దుపొడుపుల నేపుల పొడుచునేమొ."

దీని భావమేమి తిరుమలేశ ?

" పొసగ ముత్తెపుసరుల్ పోహాళించిన లీల .
తమలోన దొరయుశబ్దముల గూర్చి "

అంటాడు కవితాతత్త్వజ్ఞుడు.

ఈ మారుమూలపదాల బిగింపులో అర్థవ్యక్తి కునికినది.

' ఎపుడు నాలోని ప్రేమ నశించు నపుడె
నేను పావురాకంఠాల నిలిచి కలసి
పొంగిపడు, గుబాళింపుల పొరలు కవిత
నీరసిలి రాలిపడి మరణించిపోవు. '

' మరణించిపోవు ' అనే క్రియకు కర్త కవిత. ' నేను ' మొండిగా వ్రేలుచున్నది. అన్వయశుద్ధి శూన్యమయినది.

ఈ క్రింది పద్యమునకు సమన్వయం అగమ్యంగా ఉంది.—

" ఆలవలీలతాంబికదృగంచల చంచల చంచరీకవీ
తాలవమాధురుల్ విరియజల్లిన గొజ్జగిసెజ్జలందు ని
ద్రాలసతన్ కనుల్ మొగుడ ఆరనితీరనిశోకవేదనల్
వ్రేలెను మాలలైగగనవీథినిరాగ మయూఖపాళులై."

ఏ ఐదారుపద్యాలకో తప్పితే ఈపుస్తకంలో అన్వయం ససిగా ఉండదు.

దీక్షితులుగా రన్న కొంచెము స్వాదుత్వమైన ఎక్కడ ఉంటుందో?

"అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్" ఔచిత్యానికి అగ్రస్థానం ఉన్నదన్నాడు తత్త్వదర్శి. ఇక ఇందులోని ఔచిత్యం:

"శాల్మలీసూనహాసమంజరుల"

కవులు నవ్వును ధవళంగా వర్ణిస్తారు. ఇందులో 'బూరుగుపువ్వులనవ్వు.'

"ఎవరు సహింపనోపుదు రీయనంత
సాగరార్ద్రిమహోజ్జ్వల జ్వాలమాల"

తడిసినమంటలు ఎవరు సహాయింపనోపుదురు? ఆహా, ఎవరు సహాయింపనోపుదురు?

"అంత నేమాయె అంబికాహాసవల్లి
కామసృణవాసనాస్నానకలన నవక
మంది సురభీకరిలె."

ఏ అంబిక? కేవలం అంబిక అంటే అమ్మ కాదూ? అర్థసందర్భం అనౌచిత్య స్ఫోరక మవుతుంది.

వకుళమాలలోని కొన్నిమాటలకు తగిన అర్థమే దుర్లభమవుతున్నది.

"వయసు సొగసిన నీయెదపదమునందు." సొగయడమంటే అందగించడం కాదు; మూర్ఛిల్లుట. ఇక్కడది అనర్థము. ఈసొగయు వాడినప్పుడల్లా అనర్థకమే అయింది.

'కనుగొనల సౌభాగ్య భాగ్య సుభగాంక,'

సుభగశబ్దపు వృద్ధిరూపము సౌభాగ్యము. ఇక్కడ రెండును ప్రయుక్తములయినవి, నిరర్థకంగా.

'శ్రీకరోదయాంత లతాంతాలు.'

'తరుణాంశుకరము.'

'పలాశమసృణతరుణ తుహినాగణము'

ఇట్లాంటి అనర్థపదాలతో బిగుసుగున్నది కావ్యం. అసందర్భములు—పునరుక్తులు కొన్ని చూడండి:

'అనంతకల్పాంతము.'

'అంతమేలేని కటికశోకాంతము.'

'ఇవమినమంచుజల్లు'

'జడమాయె అచలమాయె'

'చివురివురొత్తు'

'హృదయాన భావాన'

మమ్మటాచార్యుడు "అనన్య పరతంత్రాం" అన్నాడు.

వకుళమాళలోని పారతంత్ర్యం చూడండి, పద
ములలో :

'ఆసకొనలజారిపడినస్వప్నాల' —వకుళ.

'చికురంపునీలికొనలజారిపడిన స్వప్నమ్ము'
—ఊర్వశి.

'సాంధ్యమల్లీమనోజ్ఞ' —వకుళ.

'ఆమెనవసాంధ్యసమయమల్లీమనోజ్ఞ ... ...'
—ఊర్వశి.

'ఈనవాగమాబ్దమ్ముతో ఇరులు విరిసి' —వకుళ.

'ఈనవాబ్దాగమమ్ముతో ఈకిశోర' —ఊర్వశి.

'పూవులు రేకు లూడిపడిపోయిన ఈ మునిమాపు
చాయలన్' —వకుళ.

'పూవులు రేకులూడిపడిపోయె హృదంతర ...'
—వేదుల.

భావములలో :

'నాగది నలంకరించుకొన్నాను నేనె
ఏనె వెన్నెలవెల్ల వేయించినాను.' —వకుళ.

'నామరణశయ్య పరచుకొన్నాను నేనె'
'నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను.'
—ప్రవాసము.

'బ్రదుకు బ్రదుకెల్ల నొక్క-స్వప్నముగ మార్చు'
—వకుళ.

'బ్రతుకు బ్రతుకెల్ల ఒక్క-నేత్రముగ గాంచి'
—ఊర్వశి.

ఇందలి 'అభిసారిక' అనే పద్యాలు కృష్ణపక్షపు అన్వేషణమునకు ఛాయ.

'పథమునంబోవు వనిత, ఎవ్వతవు నీవు' —వకుళ.
'వనితా ఎవ్వతవు నీపవిటపీవనిలోన్.'—కృష్ణపక్షం.
'ఎన్నటికి నేని నీదాననే నిజమ్ము' —వకుళ.
'ఆనాటి కీనాటి కేను నీదాననే,' —ఊర్వశి.
'ఈపిలుపు లేకడలనుండి ఇపుడు పిలుతు రెవరు'
—వకుళ.

'ఎవరొ హాహో, ఈనిశీథి నెగసి నీడవోలె నిలిచి పిలుతు రెవరొ?'
—ప్రవాసము.

దీక్షితులుగారు "సమకాలికుల కావ్యములలో ఇది తేల్చడము కష్టము." అని వ్రాసినారు. కాని సమకాలికులు సమకాలికుల కావ్యములను పరిశీలించి ప్రచురణాదికమునుబట్టి తేల్చగలరు. పరిచయములో 'శబ్దజాలము మార్దవముగా ఉన్నది' అని ఉన్నది. ఆమార్దవము ఈపదాలలో గమనించండి:

' పుయిలోడి ', ' కుంచించు ', ' సురభీకరిలె ', ' తమోతమస్సాంద్రము ', ' అల్లు చెచ్చలెచ్చటికొ ', ' త్రోపుళులు ', ' పులపొడుచు ', ' ఇసిరింత ', ' కళాసించు ', ' నిబిరీసము. ' ధాతుత్వ వివక్షయందు నామ పదాలకి ఇంచుగాగమం చేయవచ్చునని లాక్షణికుల అభ్యనుజ్ఞ. అట్లాగే పూర్వులు, ఆధునికులు వాడినారు. అదేపనిగా వాడితే దానిని వెఱ్ఱిఅంటారు. ఆ ఇంచుగాగమపు వెఱ్ఱి చూడండి:

' ఇగురించు ', ' ప్రయాణించు ', ' హిమానించు', 'సురభీకరించు', (ఇది చాలాభీకరముగఉన్నది). ' వాసించు ', ' విహారించు ', ' పిసాళించు ', ' పక్ష్మళించు ', 'నిస్వనించు ', 'కాంతించు', ఇందులో కొన్ని పదాలు " దొంతరదొంతరగా " " త్రుళ్లి త్రుళ్లి " పడి " సొగసి " పోతాయి.

"తునుకమబ్బుల త్రుళ్లింత దొంతరింప
మబ్బుదొంతర త్రుళ్లింత మాటుమణగి
నిడుదనిట్టూర్పు దొంతర
లేతవలపు దొంతరల త్రుళ్లింత
సోగతేకుల నరవిచ్చిసొగసిపోయి
వయసుసొగసిన

చుక్కలే చిరుమెఱపు లే సొగయబోని

వలపులివమె

ఇవమినమంచు జల్లు

సంజచాయలనివమి.

ఈ పుస్తకములో లాక్షణికదోషములు చిత్త జల్లుగ ఉన్నవి. అయితే మహాకవులలోగూడచ్యుతసంస్కృతులు లేక పోలేదు. వారి కవితావేశంలో అది నిరంకుశత్వం.

మచ్చునకు ఇందలిలాక్షణిక దోషములు :

'ఆ లతాంబిక చిరునవ్వి నంత'

విశిష్టమయిననవ్వు ఇక్కడ విశేష్యము. ధాతువని భ్రాంతి. 'చిత్రవర్షించెను' అన్నట్టుంది.

'ముగుదకుముద'

కలువ అనడానికి అకారాన్తనపుసంకలింగం వివక్షించాలి. అప్పుడు కుముదము అనకతప్పదు.

'ఇవమినమంచుజల్లు'

ఇవము నామవాచకము; ధాతువు కాదు. 'రహోర్ని దేశములు' — తప్పు. రహోనిదేశములు. "ఈనిశాంతప్రశాంతమందు." ప్రశాంతమనగా ధ్వస్త

వాచకము. ఇక్కడ ఉండవలసినది ధర్మివాచకము. 'ముగ్ధకోయిల' ఇది "శుద్ధ తప్పు". కోకిల అంటే సరిపోతుంది. కాని 'లేతహ స్తవిన్యాసము,' 'కటికశోకాం తము' అని తరువాత ఉన్నాయిగా.

ఛందో భ్రష్టములు :

ముందొక మాట. కృష్ణశాస్త్రిగారు ఎక్కడో యతిభంగాలు, గణభంగాలు చేసినారు. ఆ చేతలో అర్థం ఉన్నది. ఇంక ఇందులో ఛందో భ్రష్టాలకి కారణం కని పించదు.

" గానమేగాని రాగాంకకల్యాణమేని "

తేటగీతములో రెండే ఇంద్రగణా లుంటవి. కాని ఇందులో మూడు.

' నేడు కార్తీక మాసాంతదినము '

ఇందులో యతిభంగమయినది.

" మ్రోవగరాని రాగమధువుల్. "

పు, ఫు, బు, భు, లకు ము తో యతివేస్తే పోలిక అంటారు. దీని నేమనాలి ?

ఇప్పటికి స్థాలీపులాకంగా పుస్తకం అంతా స్పృశించడ మయింది.

"నాటినుండి చెందిన పరిణామము" దీక్షితులు గారికి ఈ కావ్యమున ఎలా గోచరమగుచున్నదో తెలియదు. "క్రొత్తరకపు కవితాసామగ్రి, క్రొత్తరకపు శబ్దజాలము, క్రొత్తక్రొత్త భావములు, అనుభవములూ కూర్చి మృదువుగా, మధురముగా కవిత్వము చెప్పగల ప్రజ్ఞ వీరికి" ఉన్నదో లేదో సహృదయులు పరికించగలరు. తత్త్వం స్పృశించి ఏ "మహానుభావులు సమీక్షాదృష్టితో తలపంకించినా సంతోషమే."

---